# పాఠకుల దృష్టిలో....

డిసెంబరు సంచికలో శ్రీ దోనేపూడి నరేష్ బాబుగారు 'శ్రీశ్రీ నవకవిత-వస్తువు' అనే నా వ్యాసాన్ని ప్రచురించినందుకు పాపం 'స్రవంతి ప్రమాణాలు పడిపోతున్నాయని' తెగబాధ పడ్డారు. 'నేటి విమర్శ వెర్రితలలు వేస్తున్నదని' నే నుదాహరించిన శ్లోకాలు 'అన్వయ రహితమనీ' పొడిమాటల్లో కితాబు ఇచ్చారు. కాని ఎట్లా ప్రమాణాలు పడిపోతున్నాయో, నా విమర్శ వెర్రితలలు ఎందుకు వేస్తున్నదో ఆ 'అక్షరసత్యాన్ని' అక్షరాల్లో చూపలేదు. అందుకని వాటికి సమాధానం చెప్పడానికి వీలుపడదు. పోతే శ్లోకాలకు అన్వయం కుదరలేదన్న దానికి మాత్రమే సమాధానం చెప్తాను.

శ్రమశక్తి ఎర్రనిదనీ—ఎర్రజెండా దాని ప్రతీక అనీ ఈనాడు ప్రసిద్ధమైన విషయం. ఈ ఎర్రజెండా పశ్చిమదేశాలనుండే వ్యాప్తి చెందిందని పలువురి విశ్వాసం. ఈ దృష్టితోనే శ్రీశ్రీకవిత్వాన్ని చూచినవాళ్ళున్నారు పలువురు. వీళ్ళ దృష్టి ఒక్కరకంగానే చూడటానికే అలవాటుపడివుంటుంది.

నేను శ్రీశ్రీ కవితను సంప్రదాయ ఆధ్యాత్మిక నేపథ్యంతో చూశాను. నలుగురు నడచిన త్రోవలో కాకుండా క్రొత్తత్రోవలో వెళ్ళేవాడు ముందుగా మార్గాన్ని గట్టి ప్రయత్నంతో ఏర్పరచుకోక తప్పదు. 'శ్రమశక్తి-ప్రాణశక్తి ఎర్రనిది' అనే విషయం భారతీయ ఆధ్యాత్మిక చింతనలో అనాదిగా అంతర్లీనమైనదే అన్నది నా అర్థవాదం. ఇదో క్రొత్త ప్రతిపాదన. నేను నిరాధారంగా ఈ మాటచెప్తే అదో వెర్రి అనకుండా ఉండరు. అర్థవాదానికి ఉపపత్తి ప్రాణం. అయితే నేనుచూపిన ఉపపత్తులు అన్వయరహితాలనీ, అనవసరమైన శ్లోకాల విస్తృతి అనీ మిత్రుని వ్యాఖ్య. చూద్దాం.

'స్వాత్మైవ'—సృష్టి ఎర్రనిది. మానవుని ఆత్మ అంటే తను అన్న భావన. ఇది ఎర్రనిది. తను అంటే తనలోని శక్తి, చేతన, బుద్ధి, కోరికలు, కార్యాలు—ఎర్రనివి— 'యాదేవీ'. 'కోరికలు-కార్యాలు'-ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల ద్వారా నెరవేర్తాయి— ఈ మూడూ ఒకటే — 'శ్రీవాగ్దేవీం'. ఈ శక్తిత్రయ సమాహారం—మానవుని శరీరమే. ఇచ్ఛ-తల, సంకల్పం అంటే జ్ఞానం-హృదయం, క్రియ. పాదాలు —ఇచ్ఛాశిరః' లోకంలోని సర్వవిషయాలను గ్రహించగల్గడమే శక్తి. నిరాధారంగా కనపడకుండా ఉన్న ఇచ్ఛ, జ్ఞానాలను ప్రకటించేది—క్రియ. 'ఏవమేత'. అదే శ్రమ-ప్రాణం. దీన్ని సిద్ధాంతీకరించడానికి ఉపపత్తులు చూపకుండా పొడి మాటలలో చెప్పితే నరేష్‌బాబుగారు ఏమనేవారో?

| ప్రాణశక్తికి ఉపమానాలైన ఎర్రని వస్తువులు | వాడిన ఎర్రని వస్తువులు |
|---|---|
| 1) బాలార్క వర్ణా (సంధ్యాకాల అరుణ వర్ణ) | సంధ్యారాగం |
| 2) రక్తాంబోధి (ఎర్రసముద్రం) | రక్త చందనం |
| 3) అరుణ సరోజం (ఎర్రని పద్మం) | బంధూకం |
| 4) అసృక్కపాలం (రక్తం స్రవించే రుండం) | పులిచంపిన లేడినెత్తురు |
| 5) త్రినయనలసితా— మూడుకండ్లతో ప్రకాశించేది అగ్ని -అంటే మూడోకంటి మంట | రుద్రాలిక నయనజ్వాలిక |

ఫోన్: 36866 టెలిగ్రామ్: హిందీసంఘ్

# 454

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

జనవరి 1992

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ పిన్నమనేని ప్రసాదరావు

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఖైరతాబాద్ - హైదరాబాద్-500 004

సంవత్సర చందా 20-00 రూ॥

విడిప్రతి 2-00 రూ॥

**Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings Dis. No. 30/55 dated 6 th January 1955.**

# ఈ సంచికలో



ముఖచిత్రం:

తెలుగు ఆడపడుచు సంక్రాంతి గొబ్బెమ్మలు

చిత్రకారుడు. మురుగన్

సంపాదకీయం

# మనవి

రాబోవు అంగీరస నామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి నాడు అనగా ఉగాదినాడు స్రవంతి కొత్త సంవత్సరంలోకి అడుగు బెట్టబోతున్నది. జయ సంవత్సరం ఉగాదినాడు ప్రారంభమైన స్రవంతి నిరంతరాయంగా నడుస్తుండడం సంతోషకరమైన విషయం. స్రవంతి 38 సంవత్సరాల తన జీవితయాత్రలో అనేకమైన ఒడిదుడుకులను ఎదుర్కొన్నది. అయినా అకుంఠిత దీక్షతో తనచేతనైనంత సాహిత్యసేవ చేస్తున్నది. అందుకు సహకరిస్తున్న కవులకూ, రచయితలకూ, పాఠకులకూ స్రవంతి కృతజ్ఞతను వెల్లడిస్తున్నది.

గడచిన ఆగస్టునుండి స్రవంతి కొత్త మార్గంలో పయనించ వలెననీ, కొత్త రూపు దిద్దుకొనవలెననీ ప్రయత్నిస్తున్నది. దానిని గ్రహించి పాఠకులు మాకు తగిన ప్రోత్సాహాన్ని కలిగిస్తున్నారు. వారికి ధన్యవాదాలు. వెనక కొన్ని ఇబ్బందుల వలన స్రవంతిని నిర్ణీత సమయంలో వెలువరించడం సంభవం గాకపోయేది. అప్పుడప్పుడు రెండు మూడు నెలలుగూడా పత్రిక వెనకబడేది. ప్రస్తుతం ప్రతినెలా ఒకటో తేదీకి క్రమం తప్పకుండా పత్రిక వెలువడుతున్నది. అంతేగాక ఇకనుండి ఒకటోతేదీకి పత్రిక పాఠకుల చేతి కందించవలెనని ప్రయత్నిస్తున్నాము. ఇదివరలో స్రవంతి ఒకసారి ఎక్కువపేజీలూ, ఇంకొకసారి తక్కువ పేజీలతో వెలువడుతూ వుండేది. ఇప్పుడు పేజీల సంఖ్యను 64కు క్రమబద్ధంచేసి ప్రచురిస్తున్నాము. ఇదేక్రమాన్ని అనుసరించగలమని మనవి చేస్తున్నాము. ఈ ఐదు నెలల మా అనుభవంలో పాఠకుల ప్రతిస్పందన బాగా కనిపిస్తున్నది. చందాదారుల సంఖ్య క్రమక్రమంగా పెరుగుతున్నది. ఆంధ్ర దేశం లోని పలు నగరాలలో విడిప్రతుల అమ్మకానికి గూడా ప్రయత్నిస్తున్నాము. హైదరాబాదు వంటి నగరాలలో విడిప్రతుల అమ్మకం ఉత్సాహకరంగా వున్నది. అందుకు ఏజంట్ల సహకారం అవసరం. విశ్వవిద్యాలయాలలో తెలుగు ఎం. ఫిల్., పి.హెచ్.డి. వంటి పరీక్షలకు పరిశోధన చేస్తున్న వారూచేసినవారూ మా కృషికి దోహదం చేస్తున్నారు,రచనలు పంపుతున్నారు అయితే ప్రాచీన సాహిత్యం మీదనే పరిశోధనా వ్యాసాలు ఎక్కువగా అందుతున్నవి.

అత్యాధునిక రచనల మీదగూడా విపులంగా చర్చ జరగవలసి వున్నది. తెలుగులో అట్టి సాహిత్యనిర్మాణం ఎక్కువగా జరుగుతున్నది. రచయితలు ఈ విషయాన్ని గూడా గుర్తించగలరని విశ్వసిస్తున్నాము. భారతదేశంలోని సోదరభాషల సాహిత్యంతో తెలుగువారికి పరిచయం కలిగించడం స్రవంతి ముఖ్యోద్దేశ్యాలలో ప్రధానమైనది. అది దృష్టిలో వున్నది. తెలుగులో అనేక పత్రికలు వెలువడుతున్నా కేవలం సాహిత్యసేవకే అంకితమైన పత్రికలు లేవు. స్రవంతి అదే లక్ష్యంతో ముందుకు సాగుతున్నది. అచ్చు ఖర్చులూ, కాగితం ధర వంటివి విపరీతంగా పెరిగిన ఈ రోజుల్లో ఆర్థిక ఇబ్బందుల కారణంగా స్రవంతిని ఇంకా సర్వాంగసుందరంగా ప్రచురించడానికి సాహసించలేక పోతున్నాము. అందరి సహకారం లభిస్తే ఆర్థికంగా గూడా సహాయం లభిస్తే పత్రిక వికాసానికి కృషి చేయడం సంభవ మవుతుంది. విరివిగా చందాదారులుగా చేరీ, తమ రచనలను పంపించీ తెలుగుసాహితీ ప్రియులూ, రచయితలూ, కవులూ, కథాకారులూ మాకు చేయూత నివ్వగలరని ఆశిస్తున్నాము.

# సాహిత్యవీథి

## శ్రీనాథ పోతనలలో లౌకికాలౌకిక శృంగారం

— ఎమ్. విజయకుమార్

ఒక బాటలో ఇద్దరు మిత్రులు కలిశారు. వారు కొంతదూరం పయనించిన పిమ్మట దారి రెండుగా చీలింది. వెంటనే ఆ మహా మిత్రులు తమ తమ పథా లవేనని నిర్దేశించుకొని చెరొక మార్గాన నవ్వుతూ విడిపోయారు. తిరిగి అనుకోకుండా. చీలిన రెండు బాటలూ ఒకే పథంగా రూపు దిద్దుకొన్నాయి. చిత్రమేమిటంటే వారిరువురి మనసులు కూడా ఏమాత్రం మార్పు లేకుండానే హర్షాన్ని ప్రకటించుకొన్నాయి.

వారు మొదట పయనించిన సాహిత్యమనే విరులతోట తిరిగి కలిసికొన్నవి. అది మోక్ష పథ మనదగ్గ బాట. ఆ మహా మిత్రులే మహాకవులు శ్రీనాథ పోతనలు. వారి కవిత్వాంశానుభూతులే మైత్రిని పెంపొందించాయన్నది సాహిత్య మౌలి కాంశం

వారిలో ఒకరు ఈశ్వరార్చనాశీలురు. మరొకరు రామభక్తులు. రాజాశ్రయం, రాజభోగం అనేవి ఒకరి జీవనమైతే, నిరాడంబరత్వం, ఆత్మాశ్రయత్వం అనేవి మరొకరి జీవిత లక్ష్యాలు. నడిచే దారులు వేరైనా నడిపించేవానికి అందరొక్కడే అనునట్లు ఈ మహా కవుల జీవితాలు విరుద్ధంగా ఉన్నా, వారి రచనల్లోని 'రసానుభూతి' ఒక్కడే అందునా ఈ మహాకవుల్లో గోచరించే రసరాజమైన శృంగారాన్ని ఒకరికి లౌకికపరంగా, మరొకరికి అలౌకిక పరంగా అన్వయించి విశ్లేషించాలి. కాని 'పండితా స్సమదర్శినః' అనునట్లు ఈ దృష్టితోనే మనం కూడా చూస్తే, ఈ ఇరువురి జీవితాల్లో 'అలౌకిక శృంగార' మనే భావనే వారి జీవిత సాహిత్య ప్రస్థానాలకి లక్ష్యం సుగమం కాగలిగిందనుట స్పష్టం.

కవి సార్వభౌమత్వం శ్రీనాథుని కవితా స్వరూపానికి నిదర్శనం. సహజ పాండిత్యం పోతన కవితా వైఖరికి ప్రతిబింబం. ఇరువురి గుండెల్లో సరసత్వం, ప్రశాంతత, లోకజ్ఞత అనేవి గూడు కట్టుకొన్నాయి. దీనారటంకాల తీర్థమాడించితి దక్షిణాధీశ ముత్యాలశాల అంటూ శ్రీనాథుడు రాచకొలువులో తనను మెప్పించే పూచీ నీదే నంటూ

---

స్వరాజ్యనగర్. తాడికొండ, P.O. గుంటూరు జిల్లా.

'సకల నికురంబ శారదాంబ' అని హాటకగర్భు రాణిని ప్రశ్నించే వైదుష్య దర్పాన్ని, వాణీ విలాసాన్ని ప్రదర్శిస్తాడు. 'కాటుక కంటినీరు చను కట్టు పయింబడ నేల యేడ్చెదో....కర్ణాట కిరాత కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ!' అనేది ఆత్మాశ్రయ ధోరణితో కూడిన వాణీ విలాసం పోతనలో కనిపిస్తుంది.

శ్రీనాథునిలో రసజ్ఞత యించుక ఎక్కువ. ఇది అదునుగా తలచి లౌకిక శృంగారస్వామిగా భావించడం కలదు. 'కంటికి నిద్ర వచ్చునె సుఖం బగునే రతికేళి' అంటూ పది వేల వైభవాలున్నా బద్ధవైరి ఉన్నచో అని శ్రీనాథుడు అనడంలో జీవితానికి 'వైరి' పదం ఆటంకంగా ఉన్నపుడు శృంగారమనే మాట 'ఆ దేవుడికే ఎరుక' అనే భోళాతనం అంతర్లీనంగా కనిపిస్తుంది. మొత్తానికి పాండిత్య ప్రదర్శన మనేదే శ్రీనాథుని జీవితానికి ముఖ్యమని గ్రహించాలి. పైగా శృంగారాన్ని వర్ణించడ మనేది శ్రీనాథుని చాటువులలో, కావ్య జీవితంలో మాత్రమే కనిపిస్తుందనడంతో అతిశయోక్తి లేదు. 'పనివడి నారికేళఫల పాకమునం జవియైన భట్టు హర్షుని కవితాను గుంభములు' అనేవి సోమరిపోతులకు కొరకరాని కొయ్యలేనన్నీ, అది ఎటువంటిదంటే 'లే జవరాలు చెక్కు గీటిన వసవల్చు బాలకుండు డెందమున' మరులను కురిపించగలడా అన్న మీమాంస వంటిదని శ్రీనాథుని అభియోగం. ఇక్కడ బుగ్గలు సవరించగల ముగ్ధబాల బాలుని దృష్టిలో అమ్మ. అదే బాల బుద్ధిభావం ఉన్న పామరులలో కావ్యకన్యా-సోయగాన్ని వీక్షించే నేర్పరితనం ఉంటుందా? అన్నది ఈ కవి సార్వభౌముని సంప్రశ్న. అంతేగాని బాలునిలో రసజ్ఞతను చిలకరించడం కాదు.

కామక్రోధౌ నృణాం లోకే నిరయస్యైవ
కారణమ్

లోకంలో సామాన్య మానవుల నాశ్రయించిన కామక్రోధాలనేవి ఉత్తమధ్యేయంలేని కారణంగా 'నరకమ్ము'నకే కారణమౌతున్నాయని పై శ్లోకభావం. కాని అటువంటి ఉత్తమమైన కామం గోపికలందూ క్రోధం హిరణ్యాక్షశిపాదులలోనూ ఉండబట్టే వారు ముక్తికి అర్హులయ్యారు. దీన్నే పోతన తన మధుర పలుకులతో 'అలుకనైన జెలిమినైన గామంబున నైన...దగిలి తలప నఖిలాత్ముడగు హరిజేరవచ్చు' అంటూ కొన్ని శాస్త్రీయోపపత్తుల్ని చెప్పాడు. ఇక గోపికల విరహ వేదనాన్ని ఆంధ్ర భాగవతంలో వర్ణిస్తూ, వారిలో నెలకొన్న కృష్ణభావ పారవశ్యాన్ని తమ ఆత్మ సంవేదనలతో గోపికలు ఆ పరమాత్మ దేహాన్నికై 'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై జల్లెడువాడు ... చెల్వాల మాన ధనంబు తెచ్చెనో మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే' అంటూ వెదికారు. ఇందులో మహాకవి కాళిదాసు వచించిన'కామార్తా హి ప్రకృతి కృపణాః చేతనా చేతనేషు' అనే అనిర్వచనీయ భావం ఈ గోపికలలో కూడా కనిపిస్తుంది. వారు ఆశించేది ఇంద్రియ స్ఖలన పూరిత దేహ శృంగారం కాదు, మధురభక్తి పూరితమయిన అలౌకిక శృంగారం. ఇదే ఆదర్శంతో పోతన తదనంతరం వెలసిన చైతన్య స్వామి తాను స్త్రీగా దివ్యగోపాలుణ్ణి నాయకునిగా భావించి తాదాత్మ్యం పొంది 'అద్వైత రసామృతాన్ని' భక్తవరుల కందించి అమృతాగ్రేసరుడుగా చిరకీర్తి పొందగలిగాడనడం సర్వవిదితం.

శ్రీనాథుని కావ్యంలో వీర శృంగారం,పోతన రచనలో భక్తి-శృంగారం అనేవి వారి రచనా లక్ష్యాలుగా గోచరిస్తాయి. ముఖ్యంగా నైషధ కావ్యంలో నలదమయంతుల ప్రేమ సన్నివేశాలో శ్రీనాథుని సున్నిత లౌకిక శృంగారం చెలియలి కట్టను అధిగమించిందా యనునట్లు దృశ్యమాన మౌతుంది. నలుడు దమయంతితో, ఇంద్రాదుల్లో ఒకరిని వివాహం చేసుకోవాల్సిందిగా కోరుతూ మరుని 'ప్రాగ్వైభవం' వారినెలా చిత్తు చేసిందో వివరిస్తూ 'స్థాణుని లోచనాంచలము దాపుగ తీవ్ర తరార్చులన్ నిజ ప్రాణము గొన్ననాటి పగ యాత్మ దలంచియో' అంటూ శివుని కంటిలోని 'అగ్ని' తన దేహాన్ని నశింపజేసి నందుకు ప్రతీ కారంగా మన్మథుడు అగ్ని దేవుడిపై పంచ బాణాల్ని సంధిస్తున్నాడనే ఔచిత్యాన్ని శ్రీనాథుడు వర్ణిస్తాడు. తను తాపమంటే వేడి' అనే అర్థంలో మదన రోగి లక్షణాల్ని ఆయా దేవతలు కన్వ యిస్తూ లౌకిక వాసనల్ని గుప్పిస్తాడు. అయినా అనిమిషుల దివ్య శృంగారం తన తనూ మూలంగా హీనత్వంలోకి జారడమనేది దమయంతి సహించ లేదు, కాబోలు. కనుకనే తన చిరకాల మనోరథం నలునినే వరించింది. అప్పటికీ ఎంతకీ కరగని నలుని పాషాణ గుండెలో కన్నీరుని కురిపిస్తూ 'ప్రవిలాక్షి నఖో నఖస్యాంబుడంబులకు నవసృష్టి ధారలై యవతరిల్లె'అంటూ వేడి యశ్రువులతో వెక్కి వెక్కి యేడుస్తూ, కంఠకాకు వికార కాకలిక' యలరునట్లుగా విరహంలో కరుణోత్పాతాన్ని సృష్టించింది. ఆ భూమిక నేపథ్యానికి శ్రీనాథుని సృజనాత్మక రసభావమే మూలం. అందునా అంగి రసం శృంగారం కాబట్టి దేవతల అలౌకిక శృంగా రాన్ని వాసనల్ని బట్టి మరీ చూపిస్తూ' దప్పికొన్నట్టి వారి కా దప్పితీర సలిల పూరంబు హితవో యాజ్యంబు హితవో' అంటూ దాహం వేసిన వారికి చల్లని నీరు యివ్వడం కన్నా కుంచెడు నెయ్యి యివ్వడంలో గల అవివేకాన్ని సూచిస్తాడు. ఇక్కడ నెయ్యిని అలౌకికంతోను, సలిలపూరాన్ని లౌకికంతోనూ ముడివేసి దమయంతి రమ్యశృంగార భావాన్ని మనోహరంగా విశ్లేషించాడు.

'సర్వ వేదాంత సారంహి శ్రీ భాగవత
మిష్యతే
తద్రసామృత తృప్తస్య నాఽన్యత్ర
స్యా ద్రతిః క్వచిత్

అన్నట్లు భాగవతరసామృతాస్వాదనలో;దివ్య రతి'ని తలపించే వైనం పోతన అలౌకిక శృంగా రానికి నిదర్శనం. కనుకనే పోతన చిన్న కృష్ణుని సైతం శృంగారమూర్తిగా తీర్చిదిద్దడంతో, చెల రేగిన వాని ఆగడాలతో విసిగిన పుత్ర సంతానం లేని ఒక గోపకాంత యశోదతో 'తన్ను మగనిగా గైకొనినన్ కొడుకులు గలిగెదరని పైబడి నాడిది వినుము శిశువు పనులే తల్లీ' అంటూ గుట్టులేకుండా మొహాన్నే కడిగి పారేస్తూ అంటుంది. నిజానికి యిక్కడ బాల కృష్ణుని లోని ముగ్ధవిలాస పూరిత దివ్యశృంగార చేష్టలకు, ఊహలకు నిదర్శనమిది. దేహభ్రాంతి యున్న ఆ గోపవనిత అజ్ఞానాన్ని పేర్కొంటూ, దైవస్వరూపాన్ని శిశువులో కూడా దర్శించవచ్చుననే రచనా వ్యంగ్యం పోతన అలౌ కిక శృంగారానికి మచ్చుతునక. ఇది నవవిధ భక్తికి మించిన ఫణితిని సూచిస్తుంది.

ఇక గోపికల ఆత్మనివేదనా భక్తిని వర్ణిస్తూ, గోపికలు శరద్రాత్రి యందు వేణుగానానికి వివ శలై తమ పుత్రులను బంధువులను వదలి యమునా నది తీరంలోనున్న కృష్ణుని సమీపించి 'మా తపము సంపద జేరితి మెట్టకేలకున్....మా మగల మాటల నొల్లము' అంటూ ఆ పరమాత్మ పాదపద్మాలకు

తమ ఆత్మ భ్రమరాలను అంకితంజేసి 'మోక్ష కామాన్ని' ఆశిస్తారు. నిజానికిక్కడ గోపికల కామం లౌకిక కామం గాదు. ఆ దివ్యస్వరూపుని నుంచి వారు కోరేది ఆధ్యాత్మికానందమే. ఒక రకంగా చెప్పాలంటే గోపికలు సాక్షాత్తు యోగులే. వీరిలోని జీవుడు దేవునిలో లీనమవుతూ ఏకాత్మ భావన పొందుటయే 'అద్వైతం'. ఈ అద్వైత భావనయే పోతనలో అలౌకిక శృంగారంగా భాసించింది. అలాగే ఈ అద్వైతాన్ని శివ కేశవుల్లో కూడా చూస్తూ పోతన చేతులారా శివుని పూజింప డేని నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని' అని అంటాడు. అలాగే రాసక్రీడ, జలక్రీడ, రుక్మిణీ కల్యాణం, ఉషాపరిణయం మొదలగు ఘట్టాల్లోని వర్ణనలు అలౌకిక శృంగార రసస్ఫూర్తికి నిదర్శనాలు. అలాగే కొన్నిచోట్ల కేవలం భౌతిక శృంగార ఛాయలు కూడా పోతన కావ్యంలో కనిపిస్తాయి.'గోపికా వస్త్రాపహరణం' సన్నివేశంలో నీటిలో ఉన్న గోపికలు కృష్ణుని ఆజ్ఞాబద్ధులై 'ఫాలతటన్యస్త కరాబ్జలై సరసలీలన్ మ్రొక్కినార'ని అనడంలోను, ఆపై గోపికలు నీటి నుండి 'కాంచన నవరత్న ఘటిత కంకణ రుచిలో పంచాయుధ గేహులగుచు' వరుసగా బయటికి వచ్చారట.

ఇంతకీ శ్రీనాధునిలో భక్తి, పోతనలో రక్తి లేదనడం వ్యాస లక్ష్యం కాదు. శ్రీనాధునిలోని లౌకిక శృంగారం రాను రాను విరక్తికి దారి తీస్తుంది. కనుకనే హరవిలాసంలో ఈశ్వరుని దారుకావన విహార ఘట్టాన్ని ఒక పరమార్థ ఘట్టంగా పేర్కొన్నాడు. పరమ పతివ్రతలగు మునిపత్నులందు ఈశ్వరుని లౌకిక శృంగార ఛాయలు పైకి కనిపిస్తాయి. అంతర్గతంగా యిది భాగవతమున గోపికా కృష్ణులందువలె ఆత్మార్పణకు కారణమై అజ్ఞానాంధకారం రూపుమాపి శివైక్యానికి దారి తీస్తున్నదనే నగ్న సత్యాన్ని తెలియజేస్తుంది. ఇది గ్రహింపలేని దేవదారు వన మహర్షులు భాగవతంలోని గోప్ప వనితల భర్తలు అసూయ పడటమనేది. వారి మనస్సులింకను పరిపక్వం కాలేదనటానికి చిహ్నంగా భావించాలి. అలాగే భీమేశ్వర పురాణంలో భీమనాథుడు ధూర్త ప్రకారంగా సానివాడ కరిగినపుడు మాణిక్యాంబిక వంటి వేశ్య బాలికల్ని వర్ణిస్తూ 'వంపింప నేర్తురు వలరాజు గెలిచిన పెద్ద కాలము వేల్పు భీమనాధు' అన్న అతిశయాన్ని జొప్పిస్తూ 'వేశ్యయనుమాట కొక్కింత వెలితిలేదు, భార్యయను మాటకేమియు బలుపు లేదు, భక్తియను మాటకై వారసరణి బొందు. వామదేవునియెడ దక్ష వాటికందు; అని దివ్యశృంగారాన్ని శ్రీనాధుడు ఆవిష్కరిస్తాడు. కాబట్టి శ్రీనాధుని పూర్తిగా లౌకిక పురుషునిగా సంభావించడం అనుచితం. పైగా అప్పటి తను జీవిస్తున్న కాలంలో శృంగార రసాధిక్యాన్ని కవి పండితులు, ప్రభువులు, ప్రజలు ఆమోదించారు. కారణం అప్పటి సామాజిక జీవన విధానమే అందుకు నేపథ్యం. ఇందుకు తోడు 'శ్రీనాధుడు సహజంగా పరిహాస చతురుడు చక్కని రూపంగాని, హాస్య సన్నివేశంగాని కనబడినపుడు తాను నవ్వి మనల నవ్వించుట శ్రీనాధుని స్వభావం,' మచ్చుకి 'సిరిగలవానికి జెల్లును తరుణులు పదియారు వేలు' అనుటలోను శివునికొక్కతె చాలనడంలోను తన కోర్కెలో కనీసపు అవసరాన్ని గుర్తింపని హరిహరుల ప్రణయ తత్వానికి తన దప్పికను తీర్చే ఉపాయానికి లంకెవేసి తన కవిత్వ దాహాన్ని తీర్చుకొనే అలౌకిక సరసజ్ఞత శ్రీనాధునిలో కనిపిస్తుంది.

డా॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాధుని గూర్చి, నిరంతరం, దేశాటనం సేయుచు విషయ లౌల్యమును వర్తించుచు వచ్చిన వాడగుటచే

నితనికి సంసారము సందర్భమగు నానందము లభింపక పోయెడిదేమో యని సంశయం కల్గు చున్నదని శృంగార శ్రీనాథునిగా అభివర్ణించారు. 'రంభగూడె తెలుంగు రాయ రాహుత్తుండు కస్తూరి కే రాజు ప్రస్తుతింతు' అని అవసాన దశలో కూడా శ్రీనాథుడు అనడం బట్టి వీరు చెప్పినది నిజమేనని పిస్తుంది. కాని ఈ కవి జీవితమంతా శృంగార మయమని చెప్పలేమంటూ శ్రీ చాగంటి శేషయ్య గారు ధర్మార్థ కామమోక్షాలకి శ్రీనాథుడు త్యాగ భోగాలతో రెండవ పురుషార్థాన్ని, విద్యాదాన పరిశ్రమల్లో ప్రథమ పురుషార్థాన్ని, శివోపాసకుడై నాల్గవ పురుషార్థాన్ని, చాటువుల్లోని, కావ్యాల్లోని రచనలబట్టి తృతీయ పురుషార్థాన్ని సాధించి సంతృప్తుడయ్యేనని విశ్లేషించారు. దీనికి తోడు శ్రీనాథుడు చిరుతనాటి నుండి శైవమతాసక్తి కల్గి ఉన్నాడనడానికి అతని పండితారాధ్య చరిత్రయే తార్కాణమంటూ నొక ఉపపత్తిని కూడా వీరు చూపించారు. మొత్తానికి పరిశీలించి చూస్తే శృంగార శ్రీనాథుడనడం నేతిబీరలోని నెయ్యి వంటిదనడం స్పష్టమట.

ఆంధ్ర భాగవతం దశమస్కంధంలో పోతన కొంత లౌకిక శృంగారాన్ని ప్రదర్శిస్తూ, ధర్మ జుని రాజసూయ యాగానికి వెళుతున్న వారాంగ నల్ని వర్ణిస్తూ, మహితకుచ భార కంపిత మధ్య లగుచు మొలమాళ్ళు మెరయ పయ్యెదలు జార ఒకరిమీద ఒకరు జల్లుకొన్న పన్నీటి చెంగావి జిలుగు పుట్టంబులు దట్టంబులుగా దోగిలి మర్మం బులు బయటపడిన అగ్గలంబులను సిగ్గులకు ఒప్పిదాలైన తమ కనురెప్పలకు అడ్డంచేస్తూ పురుష లతో రసోక్తులాడుతున్నారని వర్ణిస్తాడు. అలాగే-

'రసికులైన వారు రమణుల కొకవేళ
వంగుటెల్ల ధర్మవర్తనంబు
ఈరసమున విల్లు నారికి వంగదా
చిత్తజాత రూప సింగ భూప।

అని పోతన తన 'భోగినీ దండకం'లో కృతి పతియైన సింగ భూపాలున్ని సంబోధిస్తూ, ఫలానా వేళ కాని వేళ స్త్రీ హృదయం చలిస్తే, రసికుడైన చక్రవర్తి యంతటి వాడైనాసరే లొంగి ఉండటమే ఉత్తమ శృంగార ధర్మమని విశదీకరిస్తాడు. చలికాలంలో శ్రీకుచాలను అప్పిచ్చే వైనాన్ని యిలా తెలియజేస్తూ-

శ్రీహరి యొక్కింత వడకి చింతింపంగా
నోహో వెరతకు మని తా
శ్రీ హరికిని శ్రీ కుచము లభయంబిచ్చెన్'

అని చలిచే వణకుతున్న విష్ణువు శరీరానికి అభయంగా శ్రీదేవి కుచాలు అభయమిచ్చినాయట. శకుంతల దుష్యంతుని చూస్తూ విభ్రాంతమయి యున్న సమయంలో

'కంఠ కాలుని చేతం
గుంఠితుడగు పెట్టు మరుడు కుసుమాస్త్రం
బుల్
లుంఠించి గుణ నినాదము
ఠం ఠమ్మని బాలనేసె ఠవ ఠవ గదురన్'

అని ముగ్ధయైన శకుంతల మీద మన్మథుడు 'ఠంఠమ్మని' కుసుమ బాణాల్ని సంధించి వదిలి నాడట. పైవిషయాల్ని పరిశీలిస్తే పోతన 'భక్తిలో కన్ను మూయించి రక్తిలో ముంచెత్తిన మాటగా కనిపిస్తుంది'. అలాగే భ్రమర గీతాలలో సైతం శృంగార రసస్రవంతిని ప్రవహింప జేసినా వాని ప్రస్థానం 'మోక్షాధి' కే. పైగా శ్రీకృష్ణ తత్వాన్ని 'రాధాకృష్ణ' మతంగా వెలయించిన వల్లభాచార్యులు, ఆళ్వారులు పేర్కొనే మధుర భక్తిని పరిశీలిస్తే

పై విషయాలకి భిన్నంగా పోతన పేర్కొన్న శృంగారం. అలౌకికంగా గోచరిస్తుంది.

ప్రతి వైష్ణవ భక్తుడు తానొక స్త్రీగా, ఆ పరమాత్మణ్ణి పతిగా సంభావించుకొని 'అద్వైత రసాబ్ధి'లో తేలియాడుతాడు. అప్పటి సమయంలో వారికి పరదేవత స్మరణ మనేది వ్యభిచారం క్రింద అంటే పాతివ్రత్య లోపం క్రిందయే లెక్క. దీనిని బట్టి శృంగార రసానికి భాగవతానికి ఎంత సన్నిహిత సంబంధం ఉన్నదో తెలుస్తుంది. పైగా అలౌకిక శృంగార మనదగు నట్టి మధుర భక్తికి శృంగార రసానికి వలె స్థాయి భావం 'రతి'యే. దీనినే 'రసోవై సః' అంటారు.

'కవయతే వర్ణయతీతి కవిః' అనేది కవులలో రసభావాన్ని చిప్పిల్ల జేస్తుంది. ఆ అనంత రస ప్రవాహంలో 'శృంగారం' మరింత లలితమైనది. అందుకనే 'శృంగారాన్ని' సున్నితమైన భావంగానే పోతన, శ్రీనాథులు రచియించారు. పైగా శ్రీనాథుడెంత మహామంత్రోపాసకుడో, పోతన అంత రామభక్తుడు.

శృంగారం, భక్తి యివి రెండూ నాటి కాలపు కవుల కవితా తత్వాన్ని పరిమళింపజేస్తాయి. ఆ సాధనలో వారిలో ఎంత శృంగారముంటుందో అంత భక్తి ఉండటం కూడా సహజం. భక్తిరక్తి యివి రెండూ జీర్ణించుకొన్నవాడే నాడు మహాకవి అనుట నగ్నసత్యం. కారణం శృంగారంలో లౌకికాలౌకికాల్ని విభజించి చూస్తే, అలౌకిక శృంగారమే భక్తి అనుటలో అనౌచిత్యం లేదు. పైగా పుట్టిన జీవికి ధర్మార్థకామమోక్షాల్లోని ధర్మార్థాల్ని తాను ప్రకృతిని శాసించి కల్పించుకోగలడు. కాని, కామమోక్షాల్ని ఆ ప్రకృతి స్వరూపంగా భావించుకొని వాటినొక అలౌకిక తత్వంగా పరిగణించుకొంటాడు కనుకనే లౌకికాలౌకిక శృంగారానికి లక్ష్యం ఒక్కటే. అదే 'ఆనందో బ్రహ్మ'. ఆ రసానంద పరవశ్యంలో భౌతికస్థితిని కొన్ని క్షణాల పాటు వీడి మనసును ఆత్మలో లయం చేయటమే భక్తి. భక్తి శృంగారముల సార్థకత. ఆ సార్థకత్వమే ముక్తికి సోపానంగా మనిషి భావిస్తాడు. అందుకే శృంగారం-వీరం జోవీరుని లక్షణమైతే, శృంగారం-భక్తి అనేవి సత్త్వవంతుని లక్షణం. ఈ సత్వగుణమే ఈ కవుల్ని ఉన్నత సోపానికి తీసుకు వెళుతుంది. ప్రత్యేకించి శ్రీనాథుని రచనల్లో 'వీరం' కొలదిగా కదం తొక్కినా భక్తి శబలతతో కూడియుండి, సహజంగా శైవంలో వుండే ఆవేశ తత్వాన్ని ప్రదర్శిస్తుంది. కనుక వారివురి దృష్టిలో 'శృంగారం' అలౌకికమైనది. నాల్గవ పురుషార్థానికి మార్గం వంటిది, ఇక ఈ ఇరువురి రచనల్లో పోతన శృంగారియా? శ్రీనాథుడు శృంగారియా? అనే ప్రశ్నల్ని వెదకడం వ్యర్థం. సమరస సముచిత భావదృష్టితో మనం వీక్షించినపుడు వారి జీవితాలు అంచలంచలుగా సాగి అవసానకాలం నాటికి తమ జీవిత–సాహిత్య సందేశం 'మోక్షమే' యన్నట్లు ద్యోతకమౌతుంది. భాగవతంలో 'శ్రీ కైవల్య పదంబు జేరుటకునై - చింతించెదనందాంగనా డింభకున్' అని కావ్యాదిలోనే పోతన పునర్జన్మ రాహిత్యాన్ని కోరడం ఇందుకు నిదర్శనం. అదే శ్రీనాథుని వ్యక్తిత్వంలో 'ముగురం గూర్చిన ముండ దైవమునకున్ మోమోట లేదో సుమా!' అని భీమేశ్వరుని శాసించగల భక్తునికుండే ఆత్మ విశ్వాసం, ఆత్మ పరిపక్వత కనిపిస్తాయి. పైగా ప్రకృతి దేవతోత్సంగాన్ని 'ఆనందంబున నర్థరాత్రమ్ముల జంద్రా లోకముల్ కాయగా....మేనెల్లం బులకాంకుర ప్రకరముల్ నిండార మిన్నేటి' అన్నట్లు అర్థరాత్రిన అర్చించే శివపూజా వైనాన్ని తెలియజేయడంలో

శ్రీనాథుని ఈశ్వరార్చన కళాశీలుణ్ణిగా ఋజువు జేస్తుంది. చివరగా ప్రత్యేకించి పోతన అలౌకిక శృంగారాన్ని మరో మారు విశ్లేషిస్తాను.

పోతనని వేదాంతిగా, తాత్వికునిగా ఆంధ్ర భాగవతం వెల్లడిస్తుంది. తను పేర్కొన్న పలు తావుల్లోని అతి మృదులమైన శృంగార రసాన్ని భక్తికి 'ఆభాసంగా'గా పైకి కనిపిస్తుందని, కొంత మంది అరసిక రసిక శేఖరులు పోతనని శృంగారిగా తలచారు. ఇట్టి వారి తొందరపాటును సైతం పోతన కృష్ణపాత్రలో గోపికాపరంగా యిలా సూచిస్తూన్నాడు —

'ఇలువడి సుష్ను సేసి హృదయేశుల సిగ్గులు
వృత్తి యత్త మా
మల నెరియించి సోదరుల మానము సూరులు
పుచ్చి తల్లిదం
డ్రుల రుచిమాని బంధులకు రోత యొన
ర్చుచు జార వాంఛలన్
వల నటి సత్కులాంగనలు వత్తురె లోకులు
సూచి మెత్తురే';

అంటూ గోపికల చిత్త వృత్తి మనోదార్ఢ్యాన్ని కృష్ణుడు ప్రశ్నిస్తూ అడుగుతున్న సన్నివేశ మిది. ఇలా ప్రశ్నిస్తూనే వెంటనే 'గురూపియైన రోగియైన విడుచుట మరియాదకాదు విభు నంగనకున్' అని కృష్ణుడు గోపికలకు నచ్చ చెబుతూ, వారిలో ఉన్న లౌకిక ప్రవృత్తిని పరీక్షించి వారు కోరే 'ఆత్మ విముక్తి' భావనకు 'అలౌకికత్వాన్ని' తొడుగుతాడు. ఇట్టి శృంగారం మన అరసిక రసిక శేఖరుల దృష్టిలో భౌతిక శృంగారంగా కనిపించడం గర్హణీయం! శృంగారాన్ని చూసే దృష్టిలోనే చూడాలి. అంతకు మించిన పరిధిని కోల్పోయే 'దుర్బుద్ధి' భావం ఏనాటిప్రజలనైనా అధః పాతాళానికి త్రోసి వేస్తుంది. అలాగే దారితప్పిన స్త్రీలకు కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది. అందుకే మన ప్రాచీనులు స్త్రీని ప్రకృతి స్వరూపిణిగా, పురుషున్ని దైవాంశ సంభూతునిగా పేర్కొనడంలో గల ఔచిత్యమిదే. పైగా ఇరువురి జీవిత దాంపత్యంలో ప్రేమఫలం (అలౌలిక శృంగారం) కాచేందుకు లౌకిక శృంగార సుమాల్ని జీవిత తనులతలపై వికసింపచేసేందుకే తృతీయ పురుషార్థం స్త్రీ పురుషుల్లో నెలకొల్పబడింది. అంతేకాని యిరువురిలో తెగి విడిచిన భావాలు మన సంప్రదాయ భావాలకు, సంస్కృతికి విరుద్ధాలు. పోతన శ్రీనాథుల రచనల్లోని 'కావ్య శృంగారం' కూడా యిదే ఔచిత్యాన్ని అంతర్గతంగా పాటిస్తుంది.

పైగా ఏకో నారాయణ యనునట్లు శ్రీకృష్ణుడు పదహారువేల మంది గోపికలతో శృంగారం నెరపగా లేనిది, లౌకికజీవులమైన మనం ఆమాత్రం రసాభాసంతో ప్రవర్తించడంలో గల తప్పేమిటనే అనౌచిత్యం ఈనాటి జనధార్మిక జీవనంలో కనిపిస్తుంది. నీతిని ఎపుడూ ఒకే కోణంలోంచి మాత్రమే చూస్తే యిలాంటివే పుట్టుకొస్తాయి. కృష్ణ భావాన్ని పరమాత్మగా భావించి 'ఆధ్యాత్మిక దృష్టిలో వర్ణించే 'రాధాకృష్ణ' ప్రణయభావం వేరు. దీన్నే మనం లౌకికభావంతో పోల్చుకునే అధమ భావం వేరు. దానికి దీనితో పొత్తులేదు. కారణం ఈ సమసమాజంలో మనం కల్పించుకొన్న కొన్ని నీతినియమాలున్నాయి. వీటిని పాటించే విధానాల్ని కేవలం భాగవతం, భీమేశ్వర పురాణాల వంటివే కాక' ఆంధ్ర భారత' రచనల్లో సైతం కనిపిస్తాయి. పరిశోధించి చూస్తే ప్రాచీనుల నుండి ఈ నా టి వ ర కు ప్ర తి పా దిం ప బ డి న అంగీకరింపబడిన 'ధర్మాద్వైత' సిద్ధాంతమే నేటి జన జీవన లక్ష్యంగా కావాలని మహా మహా కవులు వాంఛించి, తమకావ్యాల్లో సూక్ష్మంగా పొందు

పరుస్తారనడం విస్పష్టం. కాకపోతే 'సంశయాత్మా వినశ్యతి' అన్నట్లు సందేహాస్పదుడు నశిస్తాడు అనడంకాక, వాటిని సదుద్దేశ్యంతో తీర్చుకొంటూ 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం' అన్న దోరణిలో పురోగమించాలి. ఇట్టి జ్ఞానాన్వేషణయే మనిషిలో కర్మ రాహిత్యాన్ని పెంపొందింప చేస్తుంది. ఇది అక్షగాం పాటించి తమ కావ్యాలో చూపిన శ్రీనాథ పోతనల లౌకికా లౌకిక శృంగార ఛాయలో కర్మ, భక్తి, జ్ఞాన యోగములతో కూడిన 'అద్వైత' తత్వమే ప్రతిపాదించబడినదని విన్నవించు కొంటున్నాను. అలాగే ఈ వ్యాసంలో పై పేర్కొన్న వివిధాంశాల్ని ఆయా గ్రంథకర్తల భావాంశాల్ని విశదీకరించ దంలో దొర్లిన అభావాలకి విజ్ఞులైన సహృదయులైన సాహితీ మనోభావుకులు మన్నింపులతో స్వీకరిస్తారని మనవి కూడ

'శృంగారీ చేత్కవిః కావ్యేజాతుః రసమయం జగత్
సఏవ వీత రాగస్చిన్నారసం సర్వమేత తత్'

కావ్యము నందు కవి శృంగారి అయినచో జగత్తే రసమయం అవుతుంది. అతడు వీతరాగుడు అయినచో నిఖిల విశ్వం నీరసమవుతుంది. ఇట్టి శృంగారం ప్రాణి కోటికి సామాన్య ధర్మం. విశేషించి దీన్ని కళాధర్మ బద్ధంగా, సౌందర్యఆనంద ప్రదాయంగా, బ్రహ్మతౌల్యాన్ని ప్రదర్శించిన ఈ యిరువురి మహాకవుల రచనలు లోక కళ్యాణమైనవిగా విశ్వశ్రేయో దాయక మనడం రసజ్ఞుల ధర్మం.

# జంటకవుల ఏకాంతసేవ- భ

డా॥ పొన్నా లీలావతమ్మ

కవిరాజహంస, కవికులాలంకార బిరుదాంకితు లైన వేంకట పార్వతీశ జంట కవుల పూర్తి పేర్లు బాలాంత్రపు వేంకట కృష్ణారావు, ఓలేటి పార్వతీశం గార్లు. వీరు రచించిన భక్తిరసాత్మక మైన ఆధునిక పద్య కావ్యమే ఏకాంతసేవ. ఈ కావ్యం మంజరీ ద్విపద, ఆట వెలది, గీత మాలిక లలో మిశ్ర ఛందస్సులో రచింపబడింది. ఏకాంత సేవ అంటే సాధారణంగా గుడిలోని దేవునికి ఉదయంనుంచి రాత్రి వరకు చేసే సేవలలో చిట్ట చివరిది అనే అర్థం వెంటనే స్ఫురిస్తుంది. కానీ ఈ కావ్యానికి జంటకవులు పెట్టిన పేరు అర్థంలో అంత కన్నా విస్తృతమయిందనీ, విశ్వవ్యాప్త మయిందనీ చెప్పాలి వీరు జీవాత్మ పరమాత్మల దివ్య ప్రణయాన్ని ఇతివృత్తంగా తీసుకొని భక్తిరస కావ్యాన్ని ఆద్యంతమూ అమలినంగా రచించారు. పరమాత్మ అయిన ప్రియునికి జీవాత్మ అయిన ప్రేయసి ఏకాంత సమయంలో చేసే సేవయే ఏకాంత సేవ.

వైష్ణవ భక్తి మార్గాలలో మధురభక్తి ఒకటి. మధురభక్తి అంటే దివ్యశృంగార భక్తి అని అర్థం. అది ఇంద్రియాతీత మైన పవిత్ర ప్రేమ. దీనినే అమలిన శృంగారం అని కూడా అంటారు. వైష్ణవ సాంప్రదాయం ప్రకారం పరమాత్మ ఒక్కడే పురుషుడు. తక్కిన ప్రపంచమంతా స్త్రీప్రాయమే. ఆ పురుషుడు శ్రీమన్మహావిష్ణువు.

'పుమాన్ విష్ణురితిఃఖ్యాతః స్త్రీ ప్రాయమితరం జగత్'

అని ప్రసిద్ధి

ఈ ప్రకారంగా ఈ లోకంలోని పురుషు లందరూ స్త్రీలతో సమానమే. ప్రకృతికి లోబడనివాడు పురుషుడు. ప్రకృతికి లోబడి దాని ఆధారంగా బతికేవారు స్త్రీలు, స్త్రీప్రాయులు అని అర్థం.

ఈ జంటకవులు సహజంగా భక్తి హృదయులు. కాబట్టి వారిరువురూ కలిసి ఒక్క ప్రేయసిగా, జీవాత్మగా, నాయికగామారి భగవంతుని ప్రియునిగా, నాయకునిగా భావించుకొని, అతని దర్శన, స్పర్శన, ఐక్యతల కోసం తపించి పోవడం, తుమ్మెదకు సందేశమివ్వడం తానూ అన్వేషణకు బయలుదేరడం చివరికి పరమాత్మ సాక్షాత్కారం కాగానే నిలువెల్ల పులకించిపోయి అతనిలో లీనమై ధన్యత జెందడం ఈ కావ్యంలో అడుగడుగునా వ్యక్తమవుతుంది. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు ఈ జంట కవుల ఏకాంతసేవకు వ్రాసిన పీఠికలో "ఇది విమర్శనా

లెక్చరర్, తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరు-533124.

తితము. వంగభాషకు రవీంద్రుని గీతాంజలి ఎట్టిదో, మనయాంధ్రమున కీమహాకవుల 'ఏకాంత సేవ' యట్టి"దని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఈ జంటకవులలో ఒకరైన బాలాంత్రపు వేంకట కృష్ణారావుగారి కుమారుడు సుప్రసిద్ధ సాహిత్యవేత్త, కవి, గాయకుడు, కళాప్రపూర్ణ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. కృష్ణశాస్త్రి గారి అభిప్రాయం ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదంటూ - 'విశ్వమంతా వెన్నెలతీగ ప్రాకుతున్నట్లు దిక్కులన్నీ దివ్యగానాలతో నిండునటు ప్రకృతి అంతా పరవశమయ్యేటట్లు ప్రవిమల భక్తి పూరితయయిన ప్రేయసి పరమేశ్వరుని గూర్చి పాడే ప్రణయగీతం ఏకాంతసేవ,అని ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురించిన భావతరంగాలలో తమ అమూల్యమయిన అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. దీనిని బట్టి ఏకాంతసేవ విశ్వవ్యాప్తమైన, సార్వజనీనమైన మధురభక్తి రసాత్మకమైన కావ్యమని, ఈ జంటకవులు పరమభక్తులని తెలుస్తుంది.

ఈ కవులు 'ఏకాంతసేవ' కావ్యాన్ని "శ్రీవిలాసంబుతో చిద్విలాసమున కర్థతాత్పర్య సమాశ్లేషమయ్యె" అని కొండంత అర్థంతో కూడిన ఉపనిషద్వాక్యంలాంటి మహావాక్యంతో మొదలు పెట్టారు. వీరు ప్రభాత సంగీతంతో కావ్యనాందీ గీతాన్ని ప్రారంభించారు. ఈ కావ్యం యొక్క నాయికానాయకులు శ్రీ అంటే ప్రకృతి 'చిత్' అంటే చిద్రూపుడైన పరమాత్మ అని అర్థం.

వీరిరువురూ అర్థతాత్పర్యాలుగా ఒకరికొకరు పెనవేసుకొన్నారు అని మంజరీ ద్విపదలో విశ్వప్రభాత అననికముందు ఈ జంటకవులు నిలబడి సూత్రధారి నాందీవచనం చేశారు. అంటే ఈ కావ్యాన్ని దశరూపకశాస్త్ర పద్ధతిలో నాటకంలో వలె కావ్యంలో నాందీవచనం ద్వారా ఇతివృత్తాన్ని సూచించారని అర్థం. దీనిని బట్టి ఈ కవుల భక్తి వినమ్రత, సంప్రదాయ విధేయత వ్యక్తమవుచున్నవి.

"ప్రకృతియది యేమొ రాగసంపన్నమయ్యె
భావమదియేమొ యానందభరితమయ్యె
దేహమదియేమొ సాత్వికాధీనమయ్యె
విభుని శ్రీపాదముల గొల్చువేళయేమొ
రమణుని ఏకాంతసేవకుసమయమేమొ

.... ... ...

భ్రమర సుందరి పద్మాసనమున నుండి
హాయిగా నప్పుడే శ్రుతివేయుచుండె
శ్యామసుందర మోహన జలదమూర్తి
యెచట గన్నులబడియెనో యేమొకాని
యప్పుడే వింతగా పురివిప్పుకొనుచు
నెమ్మినెఱజాణ నృత్యంబు నెఱపుచుండె
ఏదో విద్యుల్లతభా పుంజమిపుడు దోచె
నేదొ భవ్య వాద్య స్వనమిపుడు దోచె

పరమ మనోహర పంచమ స్వరము నెత్తి
మధురముగ మార్దవంబుగా మంజులముగ
మానసానందకరముగా మంగళముగ
పాడవేమమ్మ కోకిలా పాడవేమి"

అని ఈ విధంగా సాగిన తొలిఘట్టంలో నాయిక రూపంలో ఉన్న జంటకవులు తమ నాయకుడైన పరమాత్మ సేవకోసం, కలయికకోసం పడిన ఉత్కంఠత వ్యక్తమవుతుంది.

నాయికకు ప్రాణనాయకుని సాక్షాత్కారం తాత్కాలికంగా లభించింది. కానీ క్షణకాలంలోనే కనుమరుగై పోయింది. అప్పుడు నాయిక తన ఆత్మేశ్వరుని దర్శనంకోసం—

'నీ మనోహరమూర్తి నిశ్చల భక్తి
ధ్యానంబు సేయుచుం దన్మయత్వమున
నేకాగ్ర దృష్టితో నేనున్నవేళ
నీవె లోకంబుగా నేనున్నవేళ

నీవిలాసంబులు నీయొయారములు
నీన రసంబులు నేర్పులు చూపి
విభ్రాంతిలో ముంచి వేయుటకు
ముచ్చటయయ్యెనె మోహనాకార

నీప్రేమ రసములో నిండిన యపుడు
ఒలువెల్లఁ బులకింప నెమ్మేను మరచి
నిదురలో హాయిగా నేనున్న యపుడు
ఎరుగకుండగ వచ్చి యేమేమొ చేసి
ప్రణయ సమాధికి భంగంబుఁ గూర్చి
కలకల నవ్వుచుఁ గనుబ్రాఁమి చనుట
యాటగాఁదోచెనేఁ యాత్మేశ నీకు"

'అని ఆవేదన చెందుతుంది. దీనిని బట్టి ఈ జంటకవులు దైవసాక్షాత్కారానికై ఎంతో పరితాపం చెందారని చెప్పవచ్చు.

ప్రాణేశ్వరుడు తనకు కనుమరుగై పోయినందుకు నాయిక తనవల్ల ఏమి తప్పిదం జరిగిపోయిందో నని ఆత్మావలోకనం చేసుకొని-

విరిదండ మెడలోన వేయుటేకాని
కన్నార నీమూర్తి గాంచనే లేదు
ప్రణమిల్లి యడుగులఁ బడుటయే కాని
చేతులారఁగ సేవ చేయనే లేదు
నినుఁగాంచి ముగ్ధనై నిల్చుటేగాని
ప్రేమదీరఁగఁ బల్కరింపనే లేదు
ఏమేమొ మనసులో నెంచుటేకాని
తిన్నగా నాకోర్కె తెలుపనేలేదు

వెలుగులోఁ జీకటి విరిసెఁ గాఁబోలు
మనసులోఁ దెలివిలో మరపులు దోఁచె
అనంద మందుటే యపచారమనుచు
నవశనై యుండుటే యపరాధ మనుచు
మదినెంచి యీ రీతి మాయలు సేయ
భావ్యమై తోఁచెనే ప్రాణేశ నీకు"

అని బాధపడుతూ, తనకు కనిపించకుండా మాయమైపోవడం ధర్మమేనా? అని తన ప్రాణనాథుని ఉద్దేశించి —

"వరనందనోద్యాన వనలక్ష్మి నేను
తరుణ శృంగార మాధవుఁడవు నీవు
నీకు దక్కితి, నాకు నీవు దక్కితివి
ఏల దాఁగెద వింక హృకయాధినాథ"

అంటూ తనలో తాను సవినయంగా ప్రశ్నించుకుంటుంది. దీనినిబట్టి వేంకట పార్వతీశ కవులు భగవంతుని తమ చెలికాడుగా భావించి ఆత్మీయతతో పరమాత్మ సందర్శనానికై ప్రార్థించారని తెలుస్తుంది.

నాయిక నాయకుని అన్వేషణకు తుమ్మెద నళిని సారథిగాచేసి ప్రణయవనంలోని పుష్పరథంపై బయలుదేరుతుంది. ఎలమావి కొమ్మల నుండి సరసపునీడల జాడల నుండి తమలపాకు తీగెలనుండి, కెందమ్మి కొలకులనుండి, పన్నీటి సెలయేళ్ళనుండి, వలపుగాలి బయళ్ళనుండి పోయి పోయి దిక్కుదిక్కులలో చుక్కలగుంపులలో ఆకాశమంతా గాలించియైనా—

కల్యాణమయుఁడున్న కందువలరసి
పారిపోవక యుండఁబట్టి తేవలయు

— — —

ప్రణయ వనంబు లోపలి పుష్పరథము
తుమ్మెదా! వేవేగ తోలితేవమ్మ

— — —

శోభనాంగుని నాకు చూపెదవేని
విరిదమ్మమేడ నీ విడిది గావింతు
గుణ నిధానుని నన్ను కూర్చెదవేని
పొగడపూదోట నీ పొలము గావింతు
చెలువునంగ్రములు నన్ను చేర్చెదవేని
సురపొన్న వనము నీ సొమ్ముగావింతు'

అని నాయిక తనకు ప్రాణేశ్వరుని జతకూర్చి నట్లయితే విరిదమ్మిమేడను, పొగడపూదోటను, సురపొన్న వనమును కానుకలుగా ఇస్తానని ఆశ పెడుతుంది. ప్రేయసి తనను ఎడబాసిన ప్రియుని సమాగమాశకై యత్నించి నిరాశచెందినప్పుడు తన చెలిని రాయబారిగా పంపడం, తప్పకుండా తోడ్కొని రమ్మని తన కోరికను వ్యక్తం చేయడం, కార్యం సిద్ధించినట్లయితే కానుకలిస్తానని ఆశ చూపడం సర్వసాధారణమైన విషయమే. ఇందులో జీవాత్మ అయిన నాయిక కూడా సాధారణమైన ప్రేయసి విధంగానే ప్రవర్తించింది. దీనిని బట్టి వేంకట పార్వతీశ్వర కవులకున్న పరమాత్మ ప్రీతి, భక్తి తత్పరత వ్యక్తమవుచున్నవి.

'కల్యాణ విభుసేవ గావించువేళ
నేమి చేయఁగఁబోయి యేమి చేసితినొ
ప్రాణ నాయకునితో భాషించువేళ
నేమి చెప్పగబోయి యేమి చెప్పితినొ
విశ్వమోహన మూర్తి వినుతించువేళ
నేమి పాడగఁబోయి యేమి పాడితినొ

— — — —

అవశనై చేసిన యపచారమునకు
గుణనిధానుండిట్లు కోపింపనగునె'

అని నాయిక తన ప్రాణనాథునికి తానేమైనా అపరాధాలు చేశానేమోనని శంకించి ఆత్మశోధన చేసుకుంటూ తన చెలికత్తె అయిన తుమ్మెదకు అన్నీ ఏకరువు పెట్టి తిరిగి ప్రియునికై అన్వేషించడం కొనసాగిస్తుంది. నాయిక తుమ్మెదతో తన ప్రియుడునిండైన చూపుచూస్తే ఒయ్యారాలు కులికి నట్లుంటుందని, నిండైన నవ్వునవ్వితే వెన్నెల చిలికినట్లుంటుందని, నిండైన పలుకు పలికితే తేనె లొలికినట్లు ఉంటుందని చెప్పి, ఇవి తన ఆత్మేశునకు ఆనవాలని తెలియజేస్తుంది. ఈ ఘట్టాన్ని పరిశీలించినప్పుడు ఈ జంటకవులు పరమాత్మ వియోగానికి తాళలేక తపించే పరమభక్తులని, ఇతరుల విషయమై తమలో తాము ఆత్మశోధన చేసుకొనే ఉత్తమ సంస్కారవంతులని తెలుస్తుంది.

నాయిక తన నుండి దూరమై పోయిన తన ప్రియుడు విశ్వంలోని వింతవస్తువులలో, జీవులలో, వాటి చేష్టలలో చిక్కుకొని పోయా డేమోనని సందేహిస్తుంది. ఈ సందేహం ప్రియుని ఎడబాటును సహించలేని ప్రేయసికి కలగడం సహజం.

'నాలోని దీపమ్ము నా మేని సొమ్ము
నా జాబిల్లి కొండ నా పూలదండ
నా తోడ నాడుచు నను మోసగించి
నందన వనములో నన్నొంటి దించి

— — — —

యలయించి సెనుడించి యానందమూర్తి
యలవోక వనవీథి నరుగుచునుండ
నాడుచు వేడుచు నలరుఁ గన్నియలు
తేనెపానకము లందించినారంట
విరిబోణి యీ మాట విన్నావఁటమ్మ
కనకాంగి నానాథుఁ గన్నావటమ్మ'

అని నాయిక ప్రియునిపై తన సందేహాన్ని, అతనిని దర్శించాలనే కౌతుకాన్ని వ్యక్తంచేస్తుంది. దీనిని బట్టి వేంకట పార్వతీశ్వర కవులు తమకు భగవంతుడు ఎంతకూ సాక్షాత్కరించనందుకు భగవంతుడు తమను ఉపేక్షించి ఇతర భక్తులపై దయావీక్షణాలను ప్రదర్శిస్తున్నాడని, తమను అనుగ్రహించలేదని ఆవేదన చెందినట్లు వ్యక్తమవుతుంది.

ఏకాగ్ర చిత్తంతో ప్రియునికై ఎదురు చూస్తున్నప్పుడు ఏ మాత్రం చప్పుడు వచ్చినా తన ప్రియుడేమోనని మనస్సు చెదిరిపోతుంది. ఈ భ్రమ వల్ల మనస్సుకు ఆరాటమేకాని ఊరట కలుగదు.

ఆ విధంగానే నాయిక పాత్రలో నిక్షిప్తమై వున్న ఈ జంట కవులు కూడా-

పూలరథం బెక్కి పోయెడు వేళఁ
ప్రణయ గీతములనేఁ బాడెడు వేళ
విభు వేణునాదంబు వినిపించు వేళ
చిత్తమా! చిత్తమా చెదరబోకమ్మ"

అని పూలరథం ఎక్కిపోయే వేళలో, ప్రేమ గీతాలనుపాడుకునేవేళలో, ప్రాణనాథుని వేణునాదం వినిపించే వేళలో చెదిరిపోవద్దంటూ తన చిత్తానికి ఉద్బోధ చేసుకున్నారు. ప్రకృతి గతమైన లౌకికానందం క్షణికమైంది. ఒక్క పరమాత్మతోటి అనుబంధమైన ఆనందమే శాశ్వతమయింది. దానినే బ్రహ్మానందం అంటారు. భక్తిజ్ఞాన సంపన్నులైన వేంకట పార్వతీశ్వర కవులు ఈ విధమైన నిత్యానందం కోసమే పరితపించినట్లు —

"విజ్ఞాన సీమలో విహరించు కంటె
నానంద వీథిలో నాడుట కంటెఁ
బరమ ధామంబులోఁ బాదుట కంటె
నింకఁ గోరుటకు నీకేమి కావలెనె
మలయమారుత మృదు మధురరాగమునఁ
బాడవే కోకిలా పాడవే పదము"

అనే ఖండికను బట్టి తెలుస్తుంది.

"ఏకాంత సేవలో నీవేళదాఁకఁ
బద్మాసనంబున్న బడలిక దీఱ
శ్రీ పుష్పయోగ సంసిద్ధి చేకూరఁ
దేఁటికిఁ బాడినదే పాటయాయె"

అని ప్రారంభించిన నాయికా నాయక సమాగమ ఘట్టంలో అపూర్వమైన అంతిమ సమాగమాన్ని ఈ భక్త కవులు —

"నిత్య మోహనమైన నీ మూర్తిఁ జూచి
నిత్య నూతనమైన నీ సేవఁ జేసి
నిత్య సత్యానంద నిలయుండవైన
హృదయేశ! నినుఁ గోరి యిన్నాళ్ళకైన
సవతు లందరలోనఁ జరితార్థనైతి"

"కాలజీమూత నిర్గత వారికణము
కమనీయ నవమౌక్తికంబైనయట్లు
నా పుణ్యమునఁ జేసి నా జీవితేశ
నీ దర్శనము జేసి నే ధన్యనైతి
కన్నులు చల్లగాఁ గనుఁగొనఁగంటి
హృదయేశ! నా భాగ్యమే భాగ్యమయ్యె!'

అని— తమకు కలిగిన దివ్యానందాన్ని వ్యక్తం జేశారు. ఈ కవులు పరమాత్మను 'పరమాణువు కంటె పరమాణువైన' అతిలోకమూర్తిగా 'మహదార్థమున కంటె మహదర్థమైన' మహనీయునిగా విశ్వసించిన వినమ్ర హృదయులు. ఈ కవులు పరమాత్ముని ప్రాభవాన్ని గూర్చి —

"భువనంబు లన్నియు బొజ్జలో నున్న
నిఖిలేశ! నీ పజ్జ నిలువంగఁ గంటి
సంపూర్ణ లోకైక సాక్షివై యున్న
శుభతేజ! నీ మూర్తి చూఁడఁగా గంటి
ఆగమాంతోక్తుల కందఁగారాని
మహిమాఢ్య! నీతోడ మాటాడఁ గంటి
అఖిలంబునకు నంటి యంటక యున్న
నిర్వికారుని నిన్ను నే బొందఁ గంటి"

అని వర్ణించారు.

అలాగే స్వామి దర్శనం వల్ల తమకు అమితానందం కలిగిందంటూ —

"తనువెల్లఁ బులకించెఁ దన్మయత్వమున
నంత రంగము పొంగె నానంద గరిమఁ
బడియుంటి నవశనై భవదంతికమున
నన్నుద్ధరింపవే నా జీవితేశ"

అని — తమను కడతేర్చుమని వేడుకున్నారు. నాయిక తాను ఇన్నాళ్ళు పడిన శ్రమ అంతా ఫలించిందని, తన కోరిక నెరవేరిందని, సుందరమైన తన ప్రియుని మోము సందర్శనం కలిగిందని, మోక్షం వచ్చిందని అంటూ —

"నాయాసము ఫలించె నాసలు దీరె
నా మోదము లభించె నభిమతం బొదవె
నాలోక రమణీయమైన నీ మోము
ఆనంద వికసితంబైన నీ మోము
అమల తేజోమయంబైన నీ మోము
కనుగొంటిఁ గైకొంటిఁ గైవల్య పదము"

అని పరమానందం చెందుతుంది.

ఈ కవులు భగవంతుని రూప తేజస్సు చూచేవారికే తెలుస్తుందని, అంతేకాని భక్తిలేని బుద్ధిమంతులకుగానీ, కవిశ్రేష్ఠులకుగానీ ఇంకెవ్వరికిగానీ తెలియదని, ఆభాగ్యం దొరకదని, భగవంతుని స్తుతించడానికి పలుకులే చాలవని అంటూ—

'తెలిసికోవలెనన్న దీక్షయేకాని
బుద్ధికంతటి సుప్రబోధమేలేదు
వర్ణింపవలెనన్న వాంఛయేకాని
కవికంతటి భావగరిమయే లేదు
దివ్య తేజంబుతో దీటు సేయుటకు
ప్రకృతి సౌందర్యమేపాటిది నాథ'

అని భగవంతుని ఔన్నత్యాన్ని కొనియాడారు. ధూర్జటి భక్త మహాకవి కూడా సత్య స్వరూపుడైన భగవంతుని వర్ణించడానికి కవిత్వం చాలదంటూ—

'ఏ లీలన్ నుతియింపవచ్చునుపమోత్ప్రేక్షా
ధ్వని వ్యంగ్య శబ్దాలంకార
భాషల కలభ్యంబైన నీ రూపమున్ చాలున్
చాలు కవిత్వమున్
నిలుచునే సత్యంబు వర్ణించుచో'

అని పేర్కొన్నాడు

నిస్తుల సౌందర్య నిలయమై యున్న
నిరవధికానంద నిలయమైయున్న
నీ మోము దమ్మిపై నిలిచిన చూపు
నీ పాద యుగముపై నిలిచిన మనసు
నీ దివ్య సన్నిధి నిలిచిన మేను
నిను వీడి పోవంగ నేర్చునటయ్య'

అనే ఖండికలో ఈ భక్తకవులు పోతన భాగవతంలో చెప్పినట్లుగానే—

'మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు
— — — —
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్తంబు యేరీతి నితరంబు చేరనేర్చు'

అనే పద్యంలోని భక్తిమాధుర్యాన్ని పొందుపరచారు.

హృదయంబు లోపలి హృదయంబులోన
ముద్రితంబయ్యె నీ మోహన మూర్తి
కన్నుల లోపలి కన్నులలోన
బింబితంబయ్యె నీ ప్రేమైక మూర్తి
శ్రుతి వీథులందలి శ్రుతి వీథులందు
గోచరంబయ్యె నీ గుప్త మంత్రంబు

'ఈ చిన్ని నుదులతో నీ ప్రేమ గీతి
ఈ దివ్యనాద మందెనసినదాఁక

'ప్రాణేశః నీ దివ్యపాద పద్మముల
భావించి సేవించి భక్తిఁ బూజింతు'

అని వేంకట పార్వతీశ కవులు పరమాత్మపై తమకున్న త్రికరణ శుద్ధి పూర్వకమధురభక్తి తత్త్వాన్ని వ్యక్తం చేశారు.

ఈ భక్త కవులు భగవంతుని ధనధాన్యాదులను, రత్నమాణిక్యాలను, ఉన్నత పదవులను, అధికారాన్ని ఇమ్మని కోరలేదు. నశ్వరమైన ఈ లౌకిక భోగ భాగ్యాలలో పరమానందం శూన్యమని జ్ఞానవంతులైన ఈ కవులు గ్రహించారు కాబట్టి భగవంతుని సన్నిధినే కోరుకున్నారు.

'నీ దర్శనము చేయ నేఁగోరికొంటి
నీ పూజ చేయంగ నేఁగోరికొంటి
నీ మాట లాలింప నేఁగోరికొంటి
నీ సేవ చేయంగ నేఁ గోరికొంటి'

అని తమ అభిలాషను వ్యక్తంచేస్తూ దయతో తమకు దాస్య స్థానం ఇచ్చి ఏలుకొనుమంటూ—

'దయతోడఁ దిలకించి దాస్యంబొసంగి
నన్నేలు కొనుమయ్య నా జీవితేశ'

అని ఈ జంటకవులు నాయికా రూపంలో భగవంతునికి తమ హృదయకాంక్షను విన్నవించుకున్నారు.

ఈ ఏకాంత సేవ కావ్యాన్ని గూర్చి సుప్రసిద్ధకవి పండిత పరిశోధక విమర్శకులు ఆచార్య డా. సి. నారాయణరెడ్డిగారు తమ 'ఆధునికాంధ్ర కవిత్వము— సంప్రదాయములు-ప్రయోగములు' అనే సిద్ధాంత గ్రంథంలో ప్రాచీనాంధ్ర శతక కర్తల భక్తి పారవము, కృష్ణ కర్ణామృతము, కృష్ణ లీలా తరంగిణి మొదలైన వానిలోని రాధా మాధవుల శృంగారము మిళితమై 'ఏకాంతసేవ'గా వెలువడింది, అని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

ఈ మధురభక్తి రసాత్మక కావ్యమైన ఏకాంతసేవ లోని అరవై రెండు పద్యభాగాలలో ప్రతి ఖండికలోను, ప్రతిపాదంలోను, ప్రతిపదంలోను, జీవాత్మ అయిన నాయికా రూపంలో వేంకట పార్వతీశ్వర కవుల మధురభక్తి తత్వం వ్యక్తమవుతుంది.

# రాయప్రోలు- లలిత- సమీక్ష

— డా॥ ఎ. పద్మబాల

రాయప్రోలు సుబ్బారావు 1892 మార్చిలో జన్మించారు. వీరి భార్య వరలక్ష్మి, వీరి కుమార్తె లలిత. ఈమె ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారి శ్రీమతి. రాయప్రోలు వారికి 'కోకిల స్వామి' అనే బిరుదుంది.

రాయప్రోలు సుబ్బారావు తెలుగు కవుల గళాన్ని సవరించి కలకూజితాల్ని పలికించేందుకు ప్రారంభకులైనారు. రాయప్రోలు వారు ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో భావ కవిత్వానికి ఒక ముఖ్య లక్షణమైన ఆత్మాశ్రయ ధోరణికి పాదులు తీసి కొత్త బాటలు తీర్చిదిద్దిన కవి శేఖరుడు. భావకవుల తోటకు తొలి తోటమాలి. విశ్వకవి రవీంద్రులు అందించిన నవ్య భావ వైఖరీ, పాశ్చాత్య సాహితీ ధోరణుల పరిజ్ఞానమూ రాయప్రోలు వారికి మౌలికమైన ఆలోచనా రీతిని అలవరిచినాయి. అతి వేల శృంగారం రాజ్యం చేస్తున్న దినాల్లో 'అమలిన శృంగార' సిద్ధాంతానికి శ్రీకారం చుట్టిన వారు రాయప్రోలు వారు. "లిరిక్కులోని అనురాగము మన కావ్యములలో వలె సంభోగ పరిణామము పొంద నక్కరలేదు. విషయేంద్రియ భోగము గాక భావాత్మకమైన స్నేహయోగంగా పరిణితమౌతుంది. దీనిని అమలిన శృంగారమని సంకేతించితిని'—అని రాయప్రోలు వారు 'తృణ కంకణం' పీఠికలో చెప్పారు. శృంగారానికి 'శుచి' అనే నామాంతరాన్ని, దాని స్థాయీ భావమైన రతికి 'ఆనందం' అనే వైదికార్థాన్ని వీరు స్వీకరించారు. శృంగారాన్ని ప్రేమ, మమత, అనురాగం, స్నేహం, ప్రణయం అనే విశేషార్థాల్లో ప్రయోగించారు. ఆంగ్లంలోని 'లిరిక్కు'ల్ని తెలుగులోకి తెచ్చిన మొదటి ఆధునిక కవి రాయప్రోలు. వీరి తృణ కంకణం దీనికి ముఖ్యోదాహరణ. రాయప్రోలు వారు ఉగాది వంటి పండగలమీద, కోయిల, పులివిస్తరాకు వంటి వాటిపై పద్యాలు రాశారు. దేశభక్తి కవిత్వానికి ఒరవడి పెట్టింది వీరే. భావ కవిత్వానికి ఒక కొత్త బాట వేసి "Romantic Revival" గా దాన్ని ప్రచారం చేసిన తొలి తెలుగుకవి రాయప్రోలు. కాబట్టి భావ కవులకు యుగకర్త రాయప్రోలు వారే.

## రాయప్రోలు రచనలు

రాయప్రోలు సాహిత్యం ప్రధానంగా మూడు శాఖలు. అవి— 1) అనువాద సాహిత్యం 2) స్వతంత్ర సాహిత్యం 3) వ్యాఖ్యాన సాహిత్యం.

17—20/3, కటారి గార్డెన్స్, రాజమండ్రి.

1) అనువాద సాహిత్యం-: వీరి అనువాద సాహిత్యం ఆంగ్లం నుండి, సంస్కృతం నుండి అవతరించింది. సాధారణంగా తెలుగు సాహిత్యం మొదట సంస్కృతం, తర్వాత ఆంగ్లం నుండి అనువదింప బడింది. కాని రాయప్రోలు ముందు ఆంగ్లం నుండి తర్వాత సంస్కృతం నుండి అనువదించాడు. అవి – 1) లలిత (1909) 2) అనుమతి (1910) 3) మిశ్ర మంజరి (1968) 4) ఉత్తర రామచరిత (1958), 5) సుందరకాండ (1978) 6) రాస పంచాధ్యాయి (1975) 7) సౌందర్య లహరి, దూత మత్తేభము, మధుకలశము, భజగోవిందం.

2) స్వతంత్ర కవిత్వం - తృణకంకణం, స్వప్న కుమారము, స్నేహలతా దేవి, కష్టకమల. ఆంధ్రాభిమానంతో ఆంధ్రావళి, తెనుగుతోట అనే వాటిని, శృంగారదృష్టితో, ప్రకృతి రామణీయకత సృష్టితో జడకుచ్చులు, కన్నె పాటలు అనే వాటిని రాశాడు. వీరి 'మిశ్రమంజరి' చూడదగింది, 1963 లో ప్రకటితం.

3) వ్యాఖ్యాన కవిత్వం – మాధురీదర్శనము, రమ్యాలోకము అనేవి పద్యమయమైనప్పటికీ రాయప్రోలు కావ్యాలమీద విమర్శలకు ప్రతి విమర్శలు. ఇవి అతని కావ్యాల మౌలిక తత్వాన్ని వివరించే గ్రంథాలు.

రాయప్రోలు సుబ్బారావు వస్తు భావ రచనలో అనేక నవ్య మార్గాల్ని చూపి ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలో కొన్ని రీతులకు, వైష్ణవ సంప్రదాయాలకు, అమలిన శృంగారాది నూత్న సిద్ధాంతాలకు, కథా కావ్యాది అనేక ప్రక్రియలకు, దేశభక్తి కవిత్వానికి మార్గదర్శకుడైనాడు.

రాయప్రోలు వారికి చిన్ననాటి నుండీ సాహిత్య వాతావరణ మేర్పడింది. వీరి మేనమామ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారి సాహచర్యంలో వీరికి చిన్నప్పుడే ఆశుకవిత్వం, అవధానచాతుర్యం అలవడింది. శాస్త్రి గారితో కలసి అవధానాలు కూడ రాయప్రోలు నిర్వర్తించారు. రాయప్రోలు వారు 'గుమగుమ లాడే కొత్తిమిర చేల మీద, కుండ పొదుగులతో భారంగా నడిచే చూడి ఆవుల మీద, ఊరి చెరువులో నుండి నీళ్ళు మోసుకుని పోయే గ్రామభామల మీద తొలి రోజుల్లో కొన్ని పద్యాలు రాశారు.

## లలిత

రాయప్రోలు సుబ్బారావు 1908-09 కాలంలో రాజమండ్రిలో విద్యాభ్యాసం చేశారు. ఆంధ్రకేసరి పత్రిక సంపాదకులైన చిలుకూరి వీరభద్రరావు, అత్తిలి సూర్యనారాయణరావు ప్రోత్సాహంతో రాయప్రోలు'జాతీయోద్ధారకులు'అనే వ్యాసం రాశారు. ఆ కాలంలో న్యాయవాదిగా ఉండి సాహిత్యవేత్త అయిన గంటి లక్ష్మన్న పంతులు గారి పరిచయం రాయప్రోలుకి కల్గింది. గంటి లక్ష్మన్నపంతులుగారు గోల్డ్‌స్మిత్ రాసిన 'హెర్మిట్ (Hermit)'ని చదివి, 'దీనిని తెలుగులో పెట్టండి' అని ఆదేశించారట. ఆంగ్లంలోని హెర్మిట్ తెలుగులో 'లలిత'గా రూపొందింది. ఒక వియోగిని విలాపంగా వెలసింది. 1909లో 'లలిత' కావ్య రచనతో రాయప్రోలు జీవితం కొత్త మలుపు తిరిగింది. రాయప్రోలు వారి తర్వాత కావ్యాలన్నిటికి బీజాలనదగిన అభిప్రాయాలు, భావనారీతులు' లలిత'లో ఉన్నాయి. అయినా 1912లో పునర్ముద్రణ జరిగేదాకా ఇది సాహితీ పిపాసుల దృష్టిని అంతగా ఆకర్షించలేదు.

తొలి ముద్రణలో 136 పద్యాలున్నాయి. రెండో ముద్రణలో 156 పద్యాలైనాయి. 1912 లో వెలువడ్డ రెండో ముద్రణకు రమాకాంతాచార్యుల వారు ఇంగ్లీషులో ప్రవేశిక రాశారు. చెళ్ళపిళ్ళ వారు

తెలుగులో అభిప్రాయం రాశారు. చెళ్లపిళ్ల వారు లలిత నవ్యకావ్యమని యిలా చెప్పారు—

'ఇందు కథాముఖము సనాతన కావ్య సంప్రదాయముల ననుసరింపక నాయికా విలాపముతో ప్రారంభమగుచున్నది.... ఇందలి ఇతివృత్తము పూణ కవి కృతి నుండి గైకొనబడినది. కాని వర్ణనములు స్వ కపోల కల్పితములే.'

రమాకాంతాచార్యుల వారు పీఠికలో, 'లలిత' కావ్యం ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో జయప్రదంగా రాయబడ్డ మొట్టమొదటి తెలుగు కావ్యమని అభిప్రాయ పడ్డారు.

**'This Poem, which I have been Priviliged to introduce to the literary pubilc of Andhra world, is, I believe, the first Successful attempt on the part of a Telugu Poet to sing the glories of the Sacred Passion of love under the direct inspiration of the votaries of English Muse and as such, marks a new epoch in the development of modern Telugu Literature.'**

రాయప్రోలుకు ముందు ఇంగ్లీషు కవుల కావ్యాల్ని అనువదించిన వారున్నా వారి రచనలు మౌలిక భావసంపత్తి లేనందువల్ల ఆంధ్రసాహిత్యంలో నవోన్మేషం కలిగింపలేక పోయాయని, ఈ కవి అలాకాక ప్రకృతిలో నుండి సూటిగా అనుభూతుల్ని చేసుకొని, వాటిని శబ్దచిత్రాలుగ మార్చి తన కావ్యంలో ప్రవేశపెట్టి కొత్తజీవం ఊదాడని రమాకాంతాచార్యులు అభిప్రాయపడ్డారు. ప్రబంధ కవిత్వంలోని పారంపరికమైన పదాడంబరాన్ని, కృత్రిమశైలీ విన్యాసాన్ని రాయప్రోలు త్యజించి నవ్యత కనబరచాడని రమాకాంతాచార్యులు రాశారు. ప్రకృతిని అత్యంత రమణీయంగా రాయప్రోలు చిత్రించారని రమాకాంతాచార్యులు వారు ఇలా చెప్పారు—

**'The crystal stream, the limpid lake, the crimson twilight, the starlit night, the rosy morning, the malting mist, the flowery creepers, the reddened blossoms, the warbling birds, the humming bees, the grazing fawns, which form the object of some of the Poetic descriptions conjure up a Scene of great Picturesqueness.'**

రమాకాంతా చార్యుల వారి అభిప్రాయంలో లలిత మొట్టమొదటి నవ్యకావ్యం. కాని తల్లావఝ్ఝల వంటి వారు 'తృణ కంకణమే నవ్యకవిత్వమున కాది గ్రంథ' మని అభిప్రాయపడ్డారు. అదీగాక 'లలిత' ఆంగ్లం నుండి అనువదింపబడింది కాబట్టి నవ్య కావ్యం అనేందుకు కొంత సందేహించవలసి ఉంది. అయితే ఆచార్య సి.నా.రె గారు 'లలిత'ను ప్రప్రథమ నవ్యకావ్యమని 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు' అనే సిద్ధాంత గ్రంథంలో వివరించారు.

## లలిత-కథ :

ఇది గోల్డ్‌స్మిత్ రాసిన **Hermit** కి ఆంధ్రీకరణ. ఇది నాయికా నాయకుల విరహంతో ప్రారంభమౌతుంది. వియోగ శృంగారమే దీనిలోని అంత సూత్రం. రాయప్రోలు నవ్యకవిత్వానికిది తొలిమెట్టు. జవ్వనులు సంసారంలోని అనురాగ మాధుర్యాన్ని చూరగొనాలే కాని వైరాగ్యంతో సన్యాసం పుచ్చుకొని అడవుల వెంటబడిపోరాదని చెప్పడంతో దంపతీనిష్ఠమైన ధర్మమే శ్రేష్ఠమని పిస్తుంది. దంపతీ నిష్ఠమైన ప్రణయం ద్వారా ఒక పరమార్థాన్ని ఆశించినపుడు అది పవిత్రమేనని రాయప్రోలు వారి కావ్యసందేశం.

'లలిత'లోని కథ స్థూలంగా—పాంథుడొకడు వియోగ హృదయంతో తన విషాద భావాల్ని ప్రకటించుకుంటూ అడవిలో తిరుగుతుంటాడు. కొంత సేపటికి 'పొంత నివాసంబుగ నున్న ఒక్కముని' ఆ పాంథుణ్ణి పలకరించి, సాదరంగా ఆహ్వానించి ఊరట కలిగేటట్లు మాట్లాడుతాడు. రాత్రి తెల్లవారుతుంది. అప్పుడు పాంథుడు మునిరూపానిక్కి వన సౌందర్యానికి ముగ్ధుడౌతాడు. ముని పాంథుని దుఃఖానికి కారణం అడుగుతాడు. పాంథుడు తన కథంతా ఇలా వివరిస్తాడు-తాను పథికుణ్ణికాననీ, జయపాలుడనే రాజుకి కుమార్తెనని, తన పేరు లలిత అని, తాను మనసార వలచిన సత్యవర్ధనుడు నిరాశుడై అడవుల కెళ్ళాడనీ వివరిస్తాడు పాంథుడు. తన ప్రియుడులేని జీవితం వ్యర్థమని దుఃఖిస్తున్న ఆ స్త్రీని ముని వేషంలో ఉన్న యువకుడు హఠాత్తుగా కౌగలించుకుంటాడు. ముని వేషంలో ఉన్నవాడే సత్యవర్ధనుడు. పాంథుని వేషంలో ఉన్నది లలిత. వీరిరువురు ఆనంద పరవశులై తనివితీర విహరించారు.

## లలిత- అనువాద విధానం

మూలంలో కథ పాంథుని విలాపంతో రెండు స్టాంజాలతో ప్రారంభమౌతుంది.

'Turn, gentle Hermit of the dale
And guide my lonely way
To where you taper cheers the vale
with hospitable ray

For here forlorn and lost I tread
with fainting steps and slow
where wilds, immeasurably spread
seem lengthening as, I go.

ఈ వాక్యాలతో పాంథుని విలాపం ముగిసింది. వెంటనే ముని సమాధాన మిచ్చినట్లు చిత్రింప బడింది. కాని తెలుగులో రాయప్రోలు వారు 33 పద్యాల్లో పాంథుని హృదయ వేదనల్ని విపులంగా వ్యక్తీకరించారు. పాంథుని విరహ బాధ ప్రబంధ రీతిలో చిత్రింపబడింది. ఆతనికి దప్పిక కల్గినట్లు, సరోవరంలో నీళ్ళు తాగి దప్పిక తీర్చుకున్నట్లు కల్పించాడు రాయప్రోలు. ఈ సందర్భంలోనే సరోవర వర్ణన, సూర్యాస్తమయ వర్ణన, సంధ్యారాగ వర్ణన, తారకా వర్ణన ప్రవేశపెట్టబడ్డాయి.

'ఓ సుగుణాల వాల! కుసుమోదయ చారు
వయో రసాల! లీ
లా సుకుమార! హారతరల స్మిత పూర్ణ
కళాలయాస్య! వా
చా సకలార్థ సాధన విశాల! దయాధవళాంత
రంగ! ఆ
హా! సఖి! నన్ను పీడనగునా? తగునా తరు
ణాళికి గతుల్.

నాటిన గాటపు వ్వలపునంబడి, నాల్గు
దినంబు లీ దురం
తాటవిలోన ద్రిమ్మరితి, నంతము లేని నదీ
నదంబులన్
దాటితి, నచ్చటచ్చట పెనంబడి కాలిడరాని
కంచెలం
దోటమి లేకయే తిరుగ నొప్పితి, కప్పిన
మోహపుందమిన్.

తాలిమిదూలి, కన్నతలిదండ్రుల మాలి,
వియోగ వారిధిన్
తేల్లి, హితాహితంబుల గణింపగనీయని
ప్రాయపువ్వగన్
సోలి. వచింప జాలని మనోభరమున్ సహి
యించి తాళగా
జాలక, ఇందు వచ్చితిని జాలమికేలర?
ఏలరా?...

నాలుక యెండెడిన్, మనమునన్ పసతూలెడి,
ముందు పోవగా

కాలు కదల్పలేను, వడకన్ దొడగెన్ తను
వెల్ల, త్రాగ నీ
క్లాలభియింప వీ పెడపొలాన, పురోగమనాభి
లాష చిం
తాలసమయ్యె, నియ్యడవి నా తప తావహతిన్
కృశించుటన్'

అటవికుల నుద్దేశించి పాంథుడు తనను కాపాడ వలసిందిగ రోదించినట్లు చిత్రింపబడింది.

ఆ తర్వాత మూలంలో ఉన్నట్లు ముని సాంత్వనోక్తులు చేర్చబడ్డాయి. మూలంలో, ఆ రాత్రే ముని పాంథుని దుఃఖానికి కారణం అడిగి నట్లుంది. తెలుగులోమర్నాడు ఉదయం ముని కాలో చిత కృత్యాలు తీర్చుకుని వచ్చి దుఃఖానికి కారణ మడిగినట్లు మార్చబడింది. ఈ లోపల ప్రభాత వర్ణన ప్రభాకర వర్ణన, మునిముఖం చూచినపుడు పాంథుని మనసులో కలిగిన వికార వర్ణన, వన వర్ణన రాయప్రోలు వారు చేర్చారు.

'కని యా చల్లని కొలకున
తని వోవగ నీరు త్రావి దగ ఐడలిక తూ
లిన కొంతతేటి తెరలుచు
తనలోన దొదంగె నిట్లు తలపోతలకున్.

వలచిన వన్నెలా డొకడు భగ్న మనోరథుడై
ఒంగా
తలరుచు, తద్వియోగ పరితాప భరాపన
యార్థ మొంటి మై
నలత వనంబు చేరి, అడియాసల గాసిలు
పాంథు చూచి. శాం
తిలెననగా, ఇనుం డలతి ధీధితి వ్రాలెను
పశ్చిమాద్రిపై.

బాలకిసాలయ ద్యుతుల భాసిలు భాగ్యవతీ
పదాంఘ్రి రా

కా లలిత ప్రతీతిని వికావిక నవ్వి, నవ
ప్రసూత తాం
బూల రసారుణాధర విభూతిని కాదని,
. కుంకుమార్చనా
శ్రీలను నోలలాడెనట వృద్ధ వికర్తన సాంధ్య
వర్తనల్.

ఇవ తాళించు కులాయ కూలముల హాయిన్
తూగుటుయ్యాల లూ
గె వసిత్రాంత శకుంత సంతతులు,
సంగీతంబులై యయ్యెడన్
దివసారంభ మహోత్సవాభిముఖ నాందీ
దేవతా మంత్రణ
స్తవముల్ సల్పెడినోయనన్ శ్రుతి నిరుక్త
స్వాదు కంఠంబులన్.'

మూలంలో పాంథునితో ముని మాట్లాడిన విధం యిలా ఉంది-

నీవు ఇంటి నుండి వెడలగొట్టబడ్డావా? ఎవరినైనా ప్రేమించావా? ప్రేమ పేరుకే అవుతుంది. అది కేవలం వినోదం. నిజమైన ప్రేమ ప్రపంచంలో లేదు, ఉంటే అది పక్షుల్లోనే [పావురాలు] వుంది. యువకుడా! నీ బాధ ఉపశమించుకో. స్త్రీలను తోసివేయి- అని మునిఅంటాడు. అందుకు పాంథుడు బాధ పడుతూ తాను భగ్నహృదయుణ్ణనీ, టైనునదీ తీరంలో నివసించే తండ్రికి ఒకే కుమార్తెననీ, ఎంతోమంది తనను ప్రేమిస్తే, తానొక సుందరుణ్ణ ప్రేమించాననీ, అతడు హిమం వంటి సుమం వంటి పవిత్రహృదయుడనీ, అతన్ని నేనే గర్వంతో చంచల స్వభావంతో ఉడికించాననీ, అతడు నిరాశాహతుడై వెళ్లాడనీ, అందుకు తాను పశ్చాత్తప్తనైనానని అతనికోసం మరణించడమే తన కర్తవ్యమని పాంథుని రూపంలో ఉన్న పడతి చెబుతుంది. ఇది విన్న మునికుమారుడామెను కౌగిలించుకుంటాడు. ఆమె ఆశ్చర్యంతో పెనుగు

లాడి చివరకు తన ప్రియుడైన ఎడ్విన్ అని తెలుసుకుంటుంది.

ముని పాంథుని సంభాషణలో రాయప్రోలు కొన్ని మార్పులు చేశారు. ముని మొదట పలకరించి నపుడు పాంథుడు దుఃఖిస్తాడు. ముని అతణ్ణి ఓదారుస్తాడు. దైవసృష్టి అగోచరస్థాయి కలిగి ఉంటుందనీ, ప్రేమ పరిణామం అనంతముఖ విస్ఫుటమైందనీ, ప్రేమే మోహంగా, వాత్సల్యంగా, స్నేహంగా అవస్థాభేదాన్ని బట్టి రూపొందుతుందని తెలిపి ప్రణయ రహస్యతత్వాన్ని ముని బోధిస్తాడు. అపుడు పాంథుడు తన విషయాన్ని ఇలా చెప్తాడు. తాను పుట్టిన కొన్నాళ్లకే తల్లి మరణించిందనీ, తన తండ్రి జయచంద్రుడనీ, తానొక హృదయ మోహ నుణ్ణి వలచాననీ, అతని 'సహవాసమభిలషించి త్రికరణ విశుద్ధమగు జతి తీపినోపి' నిశాంత పద్మిని విధాన మెలగుతున్నాననీ, తన వలపు'వృథా వ్యథ' అయిందనీ, 'వలచిన వన్నెలా డడవి పట్టి నాడనీ', 'పక్షిలేని కొమ్మయిన నావంటి వనిత' ఉండీ ఫలితం లేసందున మరణించాలని నిశ్చ యించుకున్నానని పాంథుని రూపంలో ఉన్న లలిత చెప్పింది. వెంటనే ముని పాంథుని రూపంలో ఉన్న లలితను కౌగిలించుకుంటాడు. ఆమె 'చలీకృత' కురంగిక' లాగ, 'సమీప శాల్మలీ ప్రాంతము చాటునంది', 'ఆగ్రహరోష కషాయ రక్తిమల్', 'నవారుణాధరము శాంతుల పంతము లాడ' ముని కుమారుణ్ణి నిందిస్తుంది. 'కన్నుం రక్త' బిందువులు చిందగా ఉపాలంభిస్తుంది. అపుడు ముని కుమారుడు తాను సత్యవర్ధనుడని చెప్పి 'లలితా' అని పిలుస్తాడు. ఆమె అతని 'మోమును గని రూపు రేఖలను పోల్చి', 'చెలిమి నాతని కౌగిట చేర్చు' కుంటుంది. వాళ్ల 'ప్రణయ వ్రతదీక్ష' ఈ విధంగా ఫలించింది.

## మూలానికి మెరుగులు—

రాయప్రోలు వారు మూలానికి తన రచనలో మెరుగులు పెట్టారు. ఆశ్రమంలో ముని పాంథునితో 'నన్ను పిశాచమని సందేహించకు, విధి వ్యతిరేక ముచే నిరాశ మీరం దపమాచరించెడి విరక్తుడగాని మజొండుగా సుమీ'—అని అన్నపుడు సత్యవర్ధ నుని వృత్తాంతం ధ్వనిస్తుంది. 'నలిగిన నలినము గతి మెఱుగులు మాసి ముడుంగు నీదు కోమల ముఖము'—అన్నపుడు పాంథుని స్త్రీత్వము ధ్వని స్తుంది. 'కిశోరహారిణి కరిణి దుర్గమ స్థలమున్ కలయద్రిమ్మరెద' అన్నపుడు 'హారిణి' శబ్దం స్త్రీ వాచకం కావడం ఇందులోని చమత్కారం.

మూలంలో మున్యాశ్రమంలో పిల్ల పిల్ల సయ్యాటలాడుచున్నట్లు, గడ్డి పురుగు కుంపటి చుట్టూ కిచకిచమన్నట్లున్న వాతావరణాన్ని రాయ ప్రోలు త్యజించి, మూలంలో లేని కురంగ క్రీడలు ప్రవేశపెట్టి ఆశ్రమ వాతావరణ వర్ణనానికి ఔచిత్యాన్ని కూర్చాడు. మూలంలోలేని వనవర్ణన కథకు ఉపస్కారకంగా ఉంది. వనం వేదాంతి మనసులాగ, వెలితిలేని విశ్రాంత సరస్సులాగ 'శుకముఖాక్షర రమ్య కథానులాపలీలా భరమై' ఉన్నట్లు వర్ణింపబడటం వల్ల శాంతరస పోషణకు అవకాశం ఏర్పడింది. కథంతా వనంలో జరిగినట్లు వర్ణితం. నాయకుడైన ముని పర్ణశాలలో ఉండటం, అతని వేషమేగాక మనసుగూడ సత్వదీపకంగా ఉంది. నాయిక ప్రియ వియోగంతో వైరాగ్యోన్ము ఖమై ఉంది. కావ్యంలో వియోగ శృంగారంతో పాటు శాంతం గూడ ఉంది కాబట్టి వన వర్ణన దానికి అనుగుణంగా వర్ణింపబడటం విశేషం. 'రాయప్రోలు వారు చేసిన ముఖ్యమైన మార్పిది'— అని సి. నారాయణ రెడ్డిగారు ఆధునికాంధ్ర

కవిత్వం—సంప్రదాయములు ప్రయోగములు [పు. 254]లో చెప్పారు.

మూలంలో—'For Still I tried each fickle art
Importunate and vain,
And while his Passion touch'd my heart
I triumph'd in his Pain'—

అన్నట్లు నాయిక అనవసరంగా నాయకుణ్ణి ఆడించి ఆనందించినట్లుంది. కాని రాయప్రోలు తన రచనలో లలిత సత్యవర్ధనుణ్ణి మనస్ఫూర్తిగా ప్రేమించినట్లు, 'హిమవ దవసానమున చెల వెసయ నున్న మారుతాగము మీక్షించు మల్లిక వలె' అతని సహవాసం కోసం ఉవ్విళ్ళూరుచున్నట్లు, 'సిగ్గు జడియింప' తండ్రితో తన వలపు వృత్తాంతాన్ని చెప్పలేక పోవడంచేత, ప్రియుడు నిరాశాపరుడై అడవి పట్టినట్లు వర్ణించి తన రచనలో నాయికకు ఉదాత్త స్థానమిచ్చాడు.

మూలంలో ముని తనను కౌగిలించు కున్న పుడు నాయిక ఆశ్చర్యంతో పెనుగులాడినట్లుంది. (The wondering fair one turned to Chide).తెలుగులో నాయిక రోష కంపితాధరంతో ముని కుమారుణ్ణి నిందిస్తుంది. దీనివల్ల నాయిక శీలం అతిశయమౌతుంది.

'ఓయి కుమానాయలి! యిది యొప్పునయ్య?
అబలనొకతె ననాథయై యడవి చిక్కి
దిక్కుమాలిన దానిని చక్కపిలిచి
నీతి మాలిరి కాల్పనే నీదు వ్రతము'

## లలిత-నవ్యత

కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించడం సంప్రదాయం. కాని రాయప్రోలు తన 'లలిత'ను 'ఓ సుగుణాల బాల' అని ప్రారంభించాడు. అంతే కాకుండ 'లలిత'ను నాయికా విషాద కథనంతో ప్రారంభించి రాయప్రోలు నవ్యతను కనపరిచాడు. కాల్పనిక వాద కవిత్వాన్ని తీర్చిదిద్దిన కట్టమంచి రామలింగారెడ్డి గారు 'ముసలమ్మ మరణం'లో అంతంలో ఉన్న విషాదం 'లలిత'లో ఆదిలోనే ప్రవేశ పెట్టబడింది.

'లలిత'లో ప్రతిపాదించబడ్డ ప్రేమ సిద్ధాం తంలో తాత్త్విక ఛాయలున్నాయి. కాల్పనిక కవి త్వంలో వర్ణనల్ని అంటుకుని గంభీరమైన తాత్త్విక చింతనం పూసలో దారంలాగ ప్రవహిస్తూ ఉంటుంది. ఈ కాల్పనిక కవితా రేఖ 'లలిత'లో తొంగి చూస్తుంది 'రాయప్రోలు వారి విలక్షణ రస సిద్ధాంతమైన అమలిన శృంగార తత్త్వము రేఖా మాత్రముగా ఈ కావ్యములోనే తళుక్కుమను చున్నది'—అని సి.నా.రె.అన్నారు.

ముని వేషధారి అయిన నాయకుడు పాంథ వేషధారిణి అయిన నాయికకు యిచ్చిన ఉపన్యా సాన్నిబట్టి, రాయప్రోలు వారి దృష్టిలో ప్రేమ, వాత్సల్యం, మోహం, ప్రణయం సమానాలే అనిపి స్తాయి. తల్లీ బిడ్డల వాత్సల్యం, మైత్రీ శీలుర సాధు స్నేహం, ధర్మనిష్ఠులైన దంపతుల దాంపత్యం 'ప్రేమరసాతిరేక పరిపూర్ణీకృత' జీవాలై వర్ధిల్లు తాయని రాయప్రోలు వారి భావన వీరు లలితలోని చివరి పద్యాల్లో చెలిమి, మోహం, దాంపత్యం, ప్రేమ, అనురాగం, ప్రణయం, అనే పదాలను ఇంచుమించుగా ఒకే అర్థంలో వాడారు. అయితే "వీరి ప్రేమ సిద్ధాంతము, అమలిన శృంగార తత్త్వము 'తృణకంకణము'లోనే స్థాయి నందుకున్న దని" సి.నా.రె. గారు ఆధునికాంధ్ర కవిత్వం [పు. 257]లో వివరించారు.

అయితే రాయప్రోలు వారు లలితలో సంప్రదాయ పద్ధతిని వదల్లేదు. ఈ కావ్యంలోని వృత్త విషయంలోను, పద ప్రయోగం లోను రాయప్రోలు వారెక్కువ నవ్యత చూపలేదు వీరు ప్రవేశపెట్టిన విరహ వర్ణన, సూర్యోదయాస్తమయ వర్ణన, తారకావర్ణన, వనవర్ణన మొదలైన వర్ణనల్లో కూడ నవ్యత చూపలేదు. ఈ వర్ణనలన్నీ ప్రబంధాల్లో ఉన్నవే. వర్ణనల్లో, 'హారముభారమై ............ రుచ్య పదార్థ కల్పితాహారముకారమై,............ చందనాద్యలంకారము వైరమై' అను ధోరణి పరమ సాంప్రదాయకమైనది. ఈ వర్ణనలోని అంత్య నియమ మచ్చముగా పోతన్న పభావమును పుణికి పుచ్చుకున్నదే ఇక మధ్యమధ్య ప్రయుక్తము లైన 'కొంతకు పొంతుకా'.'సూనశరుకోలలు', 'గాట పున్వలపు', 'విరహవారిధి', 'ప్రాణములెంత తీపో', 'మహోగ్ర విరాగ పరాకలము' మున్నగు నవి ప్రాచీన ప్రబంధములలోని పద బంధములను స్ఫురింప జేయును'—అని ఆధునికాంధ్ర కవిత్వంలో (పు 255) సి నా.రె. గారు రాయప్రోలు సాంప్రదాయ కలను గూర్చి తెలిపారు.

రాయప్రోలు 'లలిత' నవ్యకావ్యమంటూ, మూలమని ఒకటియున్నను దాని నతిక్రమించు రీతిలో, స్వతంత్ర కృత్తిగా నడిచినది ప్రేమగాథ ఆధునిక పరిస్థితులకనుగుణంగా చిత్రింపబడినది. ఈ విధంగా చూచినచో రాయప్రోలు వారి లలిత ప్రథమ నవ్యకావ్యమనుటకు విప్రతిపత్తి యుండ కూడదు.'— అని ఆచార్య సి.నా.రె. ఆధునికాంధ్ర కవిత్వం-సంప్రదాయములు, ప్రయోగములు [పు 257] అనే గ్రంథంలో చెప్పారు. సి.నా.రె. అన్నట్లు 'ఈ శతాబ్ది రెండో పదిలోనే సమగ్రాంధ్ర స్వరూపాన్ని సంభావించ గలిగిన క్రాంతదర్శి' రాయప్రోలు వారు అని 'ఆంధ్రోద్యమ కవితకు పాదులు— రాయప్రోలు వారి సాహిత్య దర్శనము' అన్నారు. .

## కవితావీధి

# పంచవ

మూలం :
మైథిలీ శరణ్ గుప్త

అనువాదం :
ఈమని దయానంద

కృత్రిమ మిసుమంతలేని
క్షేత్రమ్మిది యనిపించును
ప్రకృతిమాత అధినేత్రిగ
పరిపాలన సాగించును.

తనవారికి దూరమైన
మనుజుల కెపుడావేదన
వనవాసమ్మైన నగర
వాసమైన సమభావన

ఎన్నిబాధలైన సైచు
ఎడబాటున కోర్వలేదు
సన్నిధినేకోరు ప్రేమ
పెన్నిధు లాశించబోదు

మునుముందుగ స్వజనుల
వనశోభను చూపింతును
అన్నగారి వనవాసపు
టానందము వివరింతును.

కష్టాలొక్కొమ్మడిగా
క్రమ్మిన మాకేలచింత ?
సమకూరెను వాని మరచు
సహనశ కి వలసినంత.

ఆపద రాకున్నను మా
ఆర్జితశక్తి నశించదు
పునర్నగర వాసమైన
పూర్వస్మృతి మాసిపోదు

తల్లులకే తెలియలేదు
తనయుల ఆనందహేల
ప్రకృతిమాత ఒడిలో సం
ప్రాప్తమైన ప్రేమలీల.

కోవిదు లీ క్రీడనుగని
జీవనసంగ్రామ మనిరి
అయిన నిందు సత్కీర్తిని
ఆర్జించుట లేదా మరి?

వగచునేమొ ఊర్మిళ, మా
వనవాసము దుర్భరమని
ఆమెకేమితెలియు నిచట
హాయిగ మేమున్నామని'?.

ఇట్లాలోచించుచు సౌ
మిత్రిక్షణము కనులుమూసి
తెరచినంత ననుపమ సుం
దర రూపమ్మెదుట నిలిచె

తూర్పుపాలెం, ఒంగోలు, ప్రకాశం జిల్లా.

# సంక్రాంతి శోభ

-కె. నరసింహామూర్తి

రంగు రంగుల రంగవల్లులు
ప్రాంగణచ్ఛవి పసిడి నింపగ
పసుపు జల్లిన గొబ్బియమ్మలు
కాంచనాద్రుల దలప జేయగ
పసిడి పంటలు గృహము జేరగ
కర్షకుల హృది హర్షమూరగ
వచ్చిరానీ రాగములతో
గంగిరెద్దులవాడు పాడగ
అక్షపాత్రను చేతబట్టుక
జియ్యరయ్యలు భిక్షమడుగగ
పసిడి ముద్దలు పరచినట్లుగ
బంతులును చేమంతు లొప్పగ
మంచు ముత్యపు నగలు దాల్చిన
హరిత వర్ణపు వసన మొదవిన
భూమి వింతగు అందములగని
జనుల డెందము పులకరించగ
హేమంత భూపుని స్వాగతము కై
సీమంతినీజన మెదురు చూడగ
మత్తగజమును అధివసించిన
సంక్రాంతి పురుషుం డరుగుదెంచిన
సకల జగతికి సొగసు వచ్చెను.

ప్రెస్టన్ ఉన్నత పాఠశాల, జనగామ—506167, వరంగల్ జిల్లా.

# సంక్రాంతి

-కల్వకుంట రఘునాథాచార్యులు

మంచు ముత్తెమ్ముల హేమంతమ్ము పాడెడు
చలిపాట స్వాగతమ్ములను వినుచు
గాదెలలో నిండి కదలాడు సస్య ల
క్ష్మిసోయగముల వీక్షించు కొనుచు
పూల బాలల మేని పూతలచే మైని
మరపించు వాసన లరసి కొనుచు
తెలుగు వారల ద్వారముల వ్రేలు మామిడి
తోరణ తతుల సుందరత గనుచు
కవుల హృదయ సుమమ్ములు గార్చునట్టి
కవిత మకరందములను స్వీకరణ జేసి
క్రొత్త చైతన్యమును కోరుకొనుచు రమ్ము
రమ్యగుణలక్ష్మి నవ్య సంక్రాన్తి లక్ష్మి !

రక్త సిక్తంబైన రమణీయ ధారుణీ
హింసంబునకు ఔషధమ్మొసంగి
శోక వారాశిలో నేక వేయుచు మున్గు
హృదయమ్ములను సౌఖ్యపదము జేర్చి
విషము నిండిన మనోవీథులలో సుధా
రసధార లను ప్రసారం బొనర్చి
మతమౌఢ్య కూప సంపాతమౌ జగతికి
మానవత్వంపు నిశ్శ్రేణి గూర్చి

సందు సందున నూతన సంబరములు
వెల్లి విరియగ దేశీయు లుల్లసిల్ల
క్రొత్త చైతన్యమును నింపుకొనుచు రమ్ము
రమ్య గుణలక్ష్మి మకర సంక్రాన్తి లక్ష్మి !
మా మనుజాళి యంతయును మార్పును గోరుచునున్నవేళ నీ
వీ మహికేగుదెంచితివి యేమి ఘటింప దలంచియుంటివో
యేమియొ కాని, లోకమున కిమ్ము ప్రశాంత ప్రభుత్వపాలనా
క్షేమ ఫలమ్ములన్ యదియె కీర్తిని గూర్చును నీకు నిత్యమై !

---

సమైక్య సాహితీ అధ్యక్షులు, కరీంనగర్.

# స్వాతంత్ర్య సమరయోధులు

— నాగభైరవ కోటేశ్వరరావు

ఇవాళ
నీ పంచలో పెన్షన్ బెల్లం కోసం
మూగిన భిక్షగాడుచీమలివి అని
వీళ్ళని చులకనగా చూడవద్దు—

ఈ చీమలే ఒకనాడు
సింహాలై గర్జించి, శివంగులై గాండ్రించి
నువ్వుకూర్చుని కొలువు దీరిన కుర్చీని
నీకోసం యిక్కడ నిలిపాయి—

ఈ మబ్బులే ఒకనాడు
సముద్రాలను తాగి
స్వేచ్ఛామృత వర్షాన్ని తెచ్చి
నీ గుమ్మంలో కుమ్మరించాయి—

ఈ ప్రమిదలే ఒకనాడు
నీ గుడ్డి జీవితానికి
కళ్ళు ప్రసాదించాయి—

ఈ జీవులే ఒకనాడు
పూలనడిగి గంధాలు తెచ్చి
నీగాలికి పరిమళం దానం చేశాయి—

ఈ గుండెలే ఒకనాడు
రుధిరాన్ని మూడు రంగులుగా మార్చి
నీనెత్తిమీద జెండాని మొలిపించాయి—
శిధిలమై జీర్ణమై దుమ్ములో పొరలే
ఈ ఆకులను జూచి ఆక్షేపణ చేయవద్దు

ఇవే నిన్న
చెట్టుచిటారు కొమ్మన నిలిచి
తుఫాను విజృంభణాన్ని వీరోచితంగా
ఎదుర్కొని పోరాడాయి—
ఇవి అభిమానం తిని బతికే దీప్తులు
ఇవి దేశభక్తికి రూపమైన ఆపులు

నాగభైరవ ఎడ్యుకేషనల్ అకాడమీ, గుళ్ళపల్లి (పోస్టు) ప్రకాశం జిల్లా-523211.

# అశ్రు తరంగాలు

సి. కామేశ్వరరావు

ఈ అనంత విశ్వ సృష్టికి
ప్రాణం పోసిన ప్రకృతి ముఖంలో
వరకట్న విషాద విలయతాండవ లీలలు !
సామాజిక సమానత్వాన్ని చాటే
ప్రజాస్వామిక ప్రాథమిక హక్కుల
తీరానికి చేరని కల్లోలపు టలలు !
నిరాసక్తత ఆవరించిన
పరదాల తెరలమాటున
మౌనంగా ఉరితీయబడుతున్న సరదాలు !
ఇంటింటా వెలిగే సహన జ్యోతులై
నిరాశ విస్తరించిన ఆర్ద్రతతో
దీనంగా చూస్తున్న వంటింటి కుందేళ్ళు !
తరతరాల సంప్రదాయపుటాచారాల
ఉక్కు పాదాల క్రింద నలిగి
శూన్యం లోకి చూస్తున్న ఆశల కలలు!

పడగెత్తిన కామ సర్ప విషజ్వాలల్లో
హృదయ విదారకంగా విలపిస్తున్న
కన్నెరికపు సోయగాలు !
అబలత్వపు నల్లని ముసుగులో
పల్లవిలేని పాట పాడుకుంటున్న
మౌన శోక ప్రతీక గీతికలు !
అక్కున జేర్చుకున్న అశాంతి అమ్మవొడిలో
కాంతిలేని విశ్రాంతిలేని జీవన గదిలో
అనంతంగా రోదిస్తున్న చీకటి చారికలు !
మాయని గాయాల చేదు విషాదంలో
పెదవులపై విరిసే దరహాస చంద్రికల్ని
మృత్యు కౌగిలిలో దాచుకుంటున్న పచ్చి నిజాలు
శిలా హృదయ జనవాటికతో
వైయక్తిక ఆదర్శ దగ్ధసమాధుల్లో
పరితప్త అశ్రుబింబ తరంగాలు !!

తిలక్‌నగర్ స్ట్రీట్, కాశీబుగ్గ-532 222, శ్రీకాకుళం జిల్లా.

# కొత్త చిగుళ్ళు

## (రుబాయిలు)

దీపక్

ప్రవాహంకాళ్లువిరిచి పాత్రికెక్కులో బంధిస్తున్నావు
తలతో పైకెగిరి పోయి రోదసిని నగ్నం చేస్తు
న్నావు
నీ ఐదువేళ్ల పిడికిలిలో పంచభూతాలను బంధి
స్తున్నావు
ఈ విశ్వానికి కళ్ళెం బిగించి శాసిస్తున్నావు
ప్రపంచం నీ కంచంలో ఉంది ! కాని మనిషీ
ఏం సాధిస్తున్నావు?
నైతిక శిఖరం నుండి జారుతూ ఏ లోయకో
లోకువౌతున్నావు

2

కులం కలుగులో మనం దూరం
మతం మత్తుకు మనం దూరం
లంగరు వేయరా తమ్ముడూ !
మనసునావ చేరుకుంది మానవతాతీరం

మెరసిపోయే లోచనం చీకటిని చీల్చిచూస్తుంది !
పాతేయబడ్డ విత్తనం నిటినిని పీల్చి లేస్తుంది !
లోయలోకి తోయబడ్డ వెల్లువ విద్యుత్తుగా
పై కెగురుతుంది !
మబ్బులెన్ని అడ్డుకున్నా ఇనబింబం నిశిని మట్టు
బెడుతుంది !

4

ఏ రూపంలో విధి జీవిని కబళిస్తుందో?
ఏ వేషంలో అది భావిని చెరవేస్తుందో?
ఎలా చెప్పగలం? 'ఏ లకుముకి పిట్ట
ముక్కుకి ఏ చెలాకీ చేపపిల్ల చిక్కుతుందో?'

5

చిక్కని రాత్రిలో చుక్కలుంటాయి చూడు !
వేదన వేకువై వెలుగునిస్తుంది చూడు !
రోతను భరిస్తూ రోదిస్తున్నదా ? బ్రదర్
'వాష్‌బేసిన్ ఎంత తెల్లగా జీవిస్తుందో'చూడు !

× × ×

సుద్దపల్లి-నిజామాబాద్ జిల్లా, 503175.

మతోన్మాదంతో ఊగే మీనారులోనా?
రణోత్సాహంతో ఉరిమే శిఖరంలోనా?
చెప్పవేం విశ్వవిభూ ! నీవుండేది
మానవత్వంతో పొంగే హృదయంలోనా?

2

ఎటుచూసినా పెర్రరిణపు పెర్రనీడలు
ఎటదాగినా ఎదనుకొరికే విషపుగాలులు
చుట్టుముడుతున్నాయి చూడు
వచ్చని నా దేశాన్ని 'రంగు రంగుల మంటలు'

3

దేశం వద్మంలో ఉక్కు రేకువై నిలిచావు
త్యాగం గగనంలో ఎర్రచుక్కవై వెలిగావు
కృతఘ్నత ఒరలో దిగబడిన కృపాణమా !
నేడు భారతినేత్రంలో తెల్లగ్రుడ్డువై పోయావు!

4

ఆ రోజా ముద్దుకోసం ఎన్ని ముళ్ళమూకలు?
ఆ తాజా ఏపిల్ కోసం ఎన్ని వళ్ళకత్తులు?
తెల్లని కాశ్మీర్‌తో మనకెన్ని చీకట్లు?
'కలర్ టి.వీ. తోనే కదా ! బ్రదర్ కళ్లజబ్బులు'

5

'భూకంపాల దేశంలో అద్దాలమేడ'
'వెండితెరపై వెలిసే రంగులనీడ'
కాదంటావా బ్రదర్ ! 'బ్రతుకంటే
కాల ప్రవాహంలో కాగితం ఓడ'

# కథావీథి

**గుజరాతీ కథ:**

## గ్లాసుకు వెనుక

మూలం :
శ్రీ వేణీభాయీ

అనువాదం ;
శర్మ

కీభాయీ పురోహిత్ ప్రసిద్ధ గుజరాతీ కవి. జన్మభూమి సంపాదకులలో ఒకరు. ఆయన కథలు వ్రాసినవి సంఖ్యలో తక్కువ. కాని అవి ఆధునిక గుజరాతీ కథా సాహిత్యంలో తలమాణిక్యాల వంటివి. ఈ కథ ప్రసిద్ధ "వజు కోటక్" బహుమతి నందిన కథ.)

ఏ కాంతం మంచిదే. కాని ఒంటరి తనం బాగా బాధిస్తుంది. శాంతి మంచిదే. కాని శూన్యత్వం సహించరానిది. అవంతిక పరిస్థితి విచిత్రంగా వున్నది. ఆమె ఏకాంతానికీ శూన్యత్వానికీ మధ్య ఊగిసలాడుతున్నది. పర్వతం మీది బంగళాలో భర్తతో కలిసి సెలవలు గడపడానికి వచ్చింది. మొత్తం బంగళాలో ఆమె ఒంటరిగా వున్నది. బాల్కనీలో నిలబడి ఆ పర్వత ప్రాంత సౌందర్యాన్ని తిలకిస్తున్నది. దశరథ్ నవయువకుడు. స్వభావాన్ని బట్టి మంచివాడు. యోగ్యుడు. స్నేహశీలి, గుర్రాలనూ, మోటర్ సైకిలునూ, మోటరునూ తొందరగా నడిపిస్తుంటాడు. అతడంటే అతిప్రేమ అవంతికకు. అతనితోనే ఆమె వివాహం జరిగింది. ఆ రోజు గుర్రం మీద ఎక్కి దశరథ్‌తో కలిసి పక్క గ్రామాలు తిరిగి రావలెనని మోజుపడింది. కాని తన కోరికను ఆపుకొంది. అవంతికను ఒంటరిగా వదలివెళ్లడం అతని కిష్టం లేదు. అందుకని దశరథ్ గుర్రాలను తెప్పించాడు కాని తీరా బయలుదేరే సమయానికి అవంతిక తాను రానన్నది. అందువలన దశరథ్ ఒక్కడే వెళ్లాడు. పనిమనిషి నీకు గుర్ర మెక్కడం వచ్చు గదా! ఎందుకు వెళ్లలేదు అని అడగనే అడిగింది.

గుర్రంమీద కూర్చొనడానికి నాకు భయం అవంతిక జవాబు చెప్పింది.

'భయ మేమిటి? ఎందుకు ?'

'ఇంకొక విషయానికి' అని అవంతిక నవ్వింది. కోసిన ఆపిల్ ముక్కలు ముందు పెడుతూ 'ఇంకొక విషయమేమిటి?' పని మనిషి అడిగింది.

అవంతిక సిగ్గుపడింది. చిరునవ్వు నవ్వుతూ- 'ఆడవాళ్లు గుర్రపు సవారీ చేయగూడదు. కిందబడితే గర్భాశయం భగ్నం కావచ్చును. అది తలచు కొంటేనే నాకు భయం' అన్నది అవంతిక.

'ఇది మీకెవరు చెప్పారు?'

'మా పిన్నికూతురు మెట్లమీద నుండి కిందకు దొర్లిపడింది. దానితో ఆమె గర్భాశయం ఛిన్నా భిన్నమయింది. ఆమె నా కంటే పది సంవత్సరాలు పెద్దది. అయినా పిల్లలు లేకుండానే వుండిపోయింది'. అని అవంతిక దీర్ఘంగా నిట్టూర్చింది. పని మనిషి ఫక్కున నవ్వి అవంతికను క్రింది నుండి పైకి ఎగా దిగా చూసి వెళ్ళిపోయింది. అవంతిక వొంటరిగా వుండిపోయింది. పెండ్లినాటికి ఆమె వయస్సు 22 సంవత్సరాలు. ఇప్పుడు 30. దశరథ్ వంటి భర్త లభించి తాను నవయౌవనంలో వున్నది. కాని ఆమె కడుపు పండలేదు. కారణమేమిటి? అది ఆమె చింత. ఈ రోజు ఆ చింత మరీ ఎక్కువయింది. విచారసాగరంలో మునిగి పోయింది.

ఇంతలో దశరథ్ వచ్చాడు. 'డార్లింగ్ అట్లా వున్నావేం?' అన్నాడు.

చిరునవ్వునవ్వి-'ఏమిటో! అంతా శూన్యంగా కనబడుతున్నది. కాపరానికి వచ్చి ఎనిమిదేండ్ల యింది. సంతృప్తి లభించింది. కాని దాని ఫలం చేతిలోకి రాలేదు. నన్ను సనాతనురాలన్నా పరవా లేదు. నా కడుపు పండితేనే గాని నాకు సంతృప్తి వుండదు' అన్నది.

దశరథ్ బూట్లు విప్పుతూ—నీ వ్యథ నాకు తెలుసు. అయినా ఇంకా మనకు వయస్సు మించి పోలేదు గదా! ఏభయి సంవత్సరాలు వయస్సు వచ్చిన తరువాత దౌలత్‌రామ్‌ఇంట్లో ఉయ్యాల వూగింది. అది నీకు తెలుసు' అన్నారు.

'అంత వయస్సు వచ్చిన తరువాత తల్లిని గావడం నాకిష్టంలేదు'

'అవంతికా! ప్రకృతి రహస్యాన్ని ఎట్లా విప్పి చెప్పగలం?'

'విజ్ఞాన శాస్త్రం ఎంతగానో అభివృద్ధి చెందింది. మనవారు అనేక ఫలితాలు సాధించారు. ప్రకృతిని వశంలోకి తెచ్చుకొన్నారు, తెచ్చుకొంటున్నారు. మనం బొంబాయి వెళ్ళుదాం. డాక్టర్లచేత నేను పరీక్ష చేయించుకొంటాను. సంగతేమిటో తెలుస్తుంది' అన్నది.

రెండో రోజు దంపతులిద్దరూ బొంబాయికి బయలుదేరారు. బొంబాయి చేరగానే డాక్టరు సింధు నాథ్ దగ్గర సమయం తీసుకొన్నారు. డాక్టరుతో 'నాకు వివాహమై ఎనిమిదేళ్లయింద'న్నది అవంతి.

'అర్థమయింది' అంటూ డాక్టరు తన చదివే కళ్లజోడును తీసి టేబుల్‌మీద పెట్టాడు. 'ఉయ్యాల వూపవలెనని నీకు కోరిక' అన్నాడు.

'అవును,' దానికి అదృష్టం కూడా కలిసి రావాలి గదా?' అన్నది.

'అవును! కలసిరావాలి'

సంకోచం వదలి అవంతిక 'డాక్టరు గారూ! నన్ను మీరు పరీక్షించండి. నాలో ఏదైనా లోపముంటే దానికి వైద్యం చేయండి' అన్నది

'నా కటువంటి అవసరం కనబడడం లేద' న్నాడు డాక్టరు.

'నాకు అవసరం కనబడుతున్నది'.

'దశరథ్ అంగీకరించాడా?'

కాని మీరన్నదే అతడంటున్నాడు. తండ్రి కావడానికి తొందరలేదన్నాడు.

'దశరథ్ అంగీకారం అవసరం.'

'అంగీకరించాడు?'

'బాగా ఆలోచించుకొని తరువాత రా. అప్పుడు చూద్దాం' అన్నాడు డాక్టరు.

అవంతిక ఇంటికి వెళ్ళింది. ఇంకా దశరథ్ ఇంటికి రాలేదు. డాక్టర్ సింధునాథ్‌కు తిరిగి ఫోను చేసింది.

హలో

ఎస్.

'నేను అవంతిక మాట్లాడుతున్నాను. దశరథ్ ఇంకా ఇంటికి రాలేదు. ఎవరో విదేశాల నుండి వ్యాపారులు వచ్చారట. భోజనానికి రానని ఫోను చేశాడు. మనమిద్దరం ఒక మంచి హోటల్లో భోజనం చేద్దాము, మీరు తప్పక రండి' అన్నది.

ం ం ం

హోటల్లో సూప్ తాగుతూ—అవంతికా! ఈ గందరగోళమంతా మానివేసి ఒక మంచి పిల్లవాణ్ని నీ వెందుకు పెంచుకొనగూడదు?' అన్నాడు డాక్టరు.

'డాక్టరు గారూ! అది రెండు కారణాల వలన సంభవంగాదు. ఒకటి నాకు నా రక్తం నా మాంసం తాలూకు లావణ్యం కావాలి. రెండు దశరథ్‌కు గూడా అది ఇష్ట ముండదు'.

'అతడేమన్నాడు'?

ఒకసారి సంభాషణ జరిగింది. ఒక అనాథ బాలకుణ్ణి మనం పెంచుకొంటాము. కాని అతడు ఎవరి బీజమో ఎవరికి తెలుసు? అంతకంటే మనం ఒంటరిగానే బ్రతుకుదాం అదే మంచిది అన్నాడు.

'నేనతనికి నచ్చజెపుతానులే'

'వద్దు నా మీద అతడు ఇంకా మండిపడ తాడు' రేపు నేను 'ఆస్పత్రికి వస్తాను, నన్ను పరీ క్షించండి'.

'రిపోర్టు వ్యతిరేకంగా వస్తే'

'అప్పుడు చూచుకొందాము'

'విజ్ఞాన శాస్త్రం వివరించే సత్యం నీకు శత్రు వుగా పరిణమించవచ్చును'.

'మీరు డాక్టరు. నన్నెందుకు ఉపేక్షిస్తున్నారో తెలియడం లేదు' అన్నది.

'అయితే రేపు ఆస్పత్రికి రా' అన్నాడు డాక్టరు.

తరువాత భోజనం పూర్తి అయిందాకా ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ హోటల్ బయటికి వచ్చారు. అవంతిక డాక్టరును వారింట్లో వదలి తన ఇంటికి చేరింది. బట్టలు మార్చుకొని పడుకొన్నది. అప్పటికీ దశరథ్ ఇంటికి రాలేదు. కన్నుమూసింది. ఆమెకు నిద్ర మెలకువ వచ్చే సరికి తెల్లవారింది. దశరథ్ టీ టేబిల్ మీద కూర్చొని పత్రిక చూస్తున్నాడు.

గుడ్ మార్నింగ్ అని అవంతిక చిరునవ్వు నవ్వింది. ముఖం కడుగుకొని టేబిల్ పక్క కుర్చీ మీద కూర్చొన్నది.

చాలా రోజుల తరువాత ఇంతగా నిద్ర బోయావు అన్నాడు దశరథ్.

'అవును. నీవు రాత్రి ఎప్పుడొచ్చావు?'

'12 గంటలయింది'

టిఫిన్ తిని దశరథ్ వెళ్లిపోయాడు. స్నానం చేసింది. తన పొట్ట సవరించుకొన్నది. సంతానేచ్ఛ ఆమెలో పెరిగి పోతున్నది.

ఒకవారం గడిచింది. పరీక్ష రిపోర్టు వచ్చింది. అవంతికలో దోష మేమీలేదని తేలింది.

ఆ మరుసటి రోజు తిరిగి డాక్టరింటికి వెళ్ళింది. డాక్టరుగారూ! నేను మిమ్మల్ని విసుగిస్తున్నాను. క్షమించండి. నాదొక ప్రశ్నకు జవాబు చెప్పండి. అన్నది

'ఏమిటి ఆ ప్రశ్న?'

'తల్లి గావడానికి నాలో లోపమేమీ లేకపోతే దశరథ్‌లో ఏమైనా లోపమున్నదా?'

'ఉండవచ్చు. ఉండకపోవచ్చు. ఈ శరీరం విచిత్రమైనది. నీవు ఏ పిల్లవాడినైనా పెంచుకో. అది నా సలహా'....

'అది నా కిష్టంలేదు'

'అయితే వేచివుండు'.

నేను వేచివుండలేను. మీరు దోవచూపిస్తే ఆ దోవలో నడుస్తాను'.

డాక్టరు అవంతిక వంక చూస్తూ మౌనంగా వున్నాడు.

దశరథ్ పర్‌ఫెక్టుగా వున్నాడు అన్నది అవంతిక.

'పురుషత్వం ప్రబలంగావున్నా కొన్నిసార్లు ఫలితం లభించకపోవచ్చును'.

'అందుకు నేనంగీకరించను'

'కాని అది సత్యం'

అయితే......

'ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్ ఒక్కటేమార్గం,

'కృత్రిమ గర్భధారణ విషయం ప్రస్తావిస్తున్నారా డాక్టర్?'

'అవును'

'ఓ భగవంతుడా! నేను ఇతరుల బీజాన్ని ధరించాలా?'

నీ విషయంలో ఆదొక్క ప్రయోగమే మిగిలింది. కృత్రిమ గర్భధారణకు భర్తయే డోనర్ (దాత) కావచ్చును. అతని దానిలోనే మిశ్రణంచేసి గర్భధారణ చేయించవచ్చును. అట్టి స్థితిలో ఆ భర్త సంతానంగానే ఆ శిశువు భావింపబడతాడు. నీ విషయంలో అది గూడా సంభవం గాక పోవచ్చును. ఇతరుల బీజాన్ని నీవు ధరించవలసి వుంటుంది.

'అప్పుడు దశరథ్ నావాడు గాకుండాపోతాడు. డాక్టర్! నేనేమి చేయాలి? తోచడంలేదు'

అవంతిక వెళ్ళిపోయింది. ఇంట్లో అటూ ఇటూ తిరగడమారంభించింది. ఫోను మోగింది. అవంతిక ఫోను ఎత్తి హలో అన్నది.

'అవంతీ! నేను దశరథ్‌ను. నా సూట్‌కేసు సర్దిపెట్టు. సాయంత్రం విమానంలో నేను ఢిల్లీవెళ్లాలి'

'ఓ. కె. డార్లింగ్'

విమానాశ్రయం నుండి ఇంటికి వచ్చి ఆస్పత్రికి ఫోను చేసింది. డాక్టరుగారూ! ఈ రోజు రాత్రి మా యింటికి భోజనానికి రండి' అన్నది.

'నీ భర్తకు వివరం చెప్పావా'

'లేదు'

'మరి?'

మీరు రండి, అన్నీ సమక్షంలో వివరిస్తాను. దశరథ్ ఢిల్లీ వెళ్లాడు, రెండు రోజుల తరువాత వస్తాడు. నేను మీతో మాట్లాడాలి'.

డాక్టరు వచ్చాడు.

'డాక్టరు గారూ! జీవితంలో మొదటిసారి దశరథ్‌కు తెలియకుండా ముందుకు సాగుదామనుకొంటున్నాను. నేను కృత్రిమ గర్భధారణ చేయాల్సి రావడం దశరథ్‌కు తెలియగూడదు, అందుకు ఉపాయమేమైనా వున్నదా?' అని అడిగింది.

అటువంటి ఉపాయంలేదు. దశరథ్‌కు తెలియకుండా ఆ పని చేయవద్దని నీకు నా సలహా. నేను ఈ విషయంలో నీకేమీ సహాయం చేయలేను'

అవంతిక నిరుత్సాహపడింది.

భోజనమైన తరువాత డాక్టరు— అమ్మాయీ! ఇది చాలా సున్నితమైన విషయం ఆలోచించి ముందడుగు వేయాలి' అన్నాడు.

అవంతిక ఏమీ మాటాడలేదు.

'దశరథ్ రెండు రోజుల్లో వస్తాడు గదా?'

'వస్తాడు'

'అయితే అతడొచ్చిన తరువాత నాకు ఫోను చేయి'

'సరే'

డాక్టరు సెలవు తీసుకొన్నాడు. అవంతిక ఆ రాత్రి నిద్రబోలేదు.ఏమేమో ఆలోచిస్తూ కూర్చున్నది తెల్లవారింది. ఫోనుమోగింది. ఢిల్లీ ఫోను-'అవంతికా! నేను దశరథ్‌ను, ఇక్కడ నా పని పూర్తిఅయింది. పని విజయవంతంగా జరిగింది. టిక్కట్టు దొరికితే ఇవాళ రాత్రికి ఇంటికి చేరుతాను'

'మంచిది'

నీ వేమి చేస్తున్నావు?

నేనిప్పుడే లేచాను, ఇంకా టీగూడా తాగలేదు అని నవ్వింది.

అంత విరహ వేదనా? నా అవంతిక ఒక్కరోజుకే ఎండి పుల్ల అయి వుంటుంది అని దశరథ్ గూడా నవ్వాడు.

స్నానంచేసి అవంతిక తొందరగా భోజనం చేసింది. కొంచెంసేపు రేడియో విన్నది. డాక్టరుకు ఫోన్‌చేసి—దశరథ్ రాత్రికే వస్తున్నాడని చెప్పింది,

'అతడొచ్చిన తరువాత ఫోనుచేయి. మీకు సమయమిస్తాను. నా కొక మంచి ఉపాయం తోచింది' అన్నారు డాక్టరు.

'ఏమిటో ఆ ఉపాయం చెప్పండి'

'ఫోనుమీద కుదరదు'

వెంటనే గుడ్డలు మార్చుకొని నేరుగా డాక్టరు ఇంటికి పోయింది.

'నీవు వస్తావని అనుకొంటూనే వున్నాను' అన్నాడు డాక్టరు. అవంతిక ఆనందంగా వున్నది. 'డాక్టరు గారూ! ఆ ఉపాయమేమిటో సెలవివ్వండి' అన్నది.

'నీకు కృత్రిమ గర్భధారణ చేయిస్తే?'

'దశరథ్ ?'

'అతణ్ణి నేను సంభాళించుకొంటాను. ముందు నీ సంగతి చెప్పు'

కొంచెంసేపు మౌనంగా వున్నది.

'డాక్టరు గారూ! ఎందుకో నాకు భయంగా వున్నది. దానిలో తనది అనే భావం వుండదు. రెండోది ఆ బాలకుణ్ణి నేను తల్లిగా ప్రేమించగలనా? తల్లిని గనుక ప్రేమించినా దశరథ్ నాకు దూరమై పోతాడు'

'అయితే ప్రయత్నం విరమించు'

'తల్లి కానిదే నేనుండలేను. బుద్ధి ఎంత నచ్చజెప్పినా మనస్సు అంగీకరించడం లేదు'

'అంటే కృత్రిమ గర్భధారణకు నీవు తయారే గదా?'

'అవును... కాని

ఇంకా కాని ఏమిటి?

'అది ఏ పనికిరానివాడి బీజమో అయితే?' డోనర్సును వెదకాలి. అక్కడ ఈ ప్రశ్నకు తావేలేదు. నీకు సంతానం కావాలి. అది నీకు లభిస్తున్నది. విజ్ఞాన శాస్త్రం అంతవరకే చేయగలదు. అనేక పర్యాయాలు మేము విజయం సాధించలేక పోతున్నాము గూడా. అన్నింటికీ సిద్ధమైతేనే ఇటు వంటి ప్రయత్నంలోకి దిగాలి'

'డాక్టరు గారూ! నేను సిద్ధమే. ఆ వ్యక్తి మంచివాడైతే, ఆరోగ్యవంతుడైతే, మంచి వంశం వాడైతే బాగుంటుంది. అందుకు ప్రయత్నం చేయ లేరా?'

'ఏదో విశిష్టాధికారాలు కోరికలు కోరు తున్నావు. బీజం ఇవ్వమని మన మిత్రుల్ని బ్రతిమి లాడ వలసి వుంటుంది'.

'సరే, మీ యిష్టం'

ఆ వ్యక్తిని గురించి మనం తెలుసు కొనక పోవడం మంచిది. మనం తెలియనట్లుగానే వుండాలి. దానికి రికార్డు వుండదు'

'డాక్టరుగారూ! మీ మిత్రుల్లో ఒకరు అని అన్నారు గదా?'

'అది నామీద వదలు. దశరథ్ రాగానే నాకు ఫోన్ చేయి'

ఢిల్లీ నుండి దశరథ్ వచ్చాడు. స్నానం చేశాడు. భోజనం చేసి నిద్ర బోయాడు. అవంతిక ఆలోచిస్తూ కూర్చున్నది. సాయంత్రం నాలుగు గంటలకు దశరథ్ నిద్రలేచాడు. టీటేబుల్ మీద కూర్చుని ఢిల్లీలో జరిగిన వ్యాపారం గురించి వివరాలు చెప్పాడు. డాక్టరు గారు చెప్పిన మాటలు దశరథ్‌కు ఎలా చెప్పడమా అని అవంతిక ఆలో చిస్తున్నది. అదే సమయంలో ఫోను గంట మోగింది. దశరథ్ ఫోన్ ఎత్తాడు—హలో

'నేను డాక్టర్ సింధునాధ్‌ను'

'డాక్టరు గారూ! నమస్కారం. ఏమిటి విశేషం?' నాకు నీతో కొంచెం పనివున్నది. మీ ఆఫీసుకు ఫోను చేశాను ఇంట్లో వున్నావన్నారు.

'అవును'

'ఇప్పుడేదైనా పనిలో వున్నావా?'

'లేదు'

'అయితే ఒక్క అరగంటలో కన్సల్టింగ్ రూమ్‌కు రా'

'ఓ.కె.'

రిసీవర్ కిందబెట్టి అవంతిక దగ్గరకు వెళ్లాడు. డాక్టర్‌గారి ఫోను ఆస్పత్రికి నన్ను పిలిచారు.

'నిన్ను వొంటరిగానా?'

'నాకు కూడా ఏమిటో విచిత్రంగా కనబడు తున్నది. ఆరోగ్యం బాగులేనిది నీకు. డాక్టరుగారు నీ పేరైనా ఎత్తలేదు'.

ఇప్పుడు నా ఆరోగ్యం బాగున్నది గదా? నీవు లేనప్పుడు రోజూ ఒక్కసారైనా ఫోను వస్తూ వుండేది. రెండుసార్లు నేను వారి ఆస్పత్రికి వెళ్ళి వచ్చాను.

దశరథ్ ఇంకా ఏమిటో ఆలోచిస్తున్నాడు. గుడ్డలు మార్చుకొని కారు తాళం చెవులు తీసుకొని బయటికి వెళ్లాడు.

అవంతిక ఆలోచనలో పడింది. ఇద్దరూ పోవలసివున్నది. అయినా వొంటరిగా దశరథ్‌నే డాక్టరు ఎందుకు పిలిచాడో!! అన్ని మాటలూ డాక్టరు గారు దశరథ్‌కు చెప్పి వేస్తారేమో!! కళ వళ పడింది. ఒక అరగంట గడిచింది. ఇక ఇంట్లో వుండలేక పోయింది. డాక్టరు గారికి ఫోను చేసింది.

'నేను అవంతిని'

'ఒక గంట తరువాత ఫోను చేయి. ఇప్పుడు బిజీగా వున్నాను. ఫోను పెట్టి వేశాడు డాక్టరు.

'దశరథ్! గోడ పడిపోకముందే దాన్ని మర మ్మత్తు చేయడం మంచిది' అన్నాడు డాక్టర్.

నాకు అర్థం గావడంలేదు.

అవంతికకు మాతృత్వపు ఇచ్ఛ బలంగా వున్నది. నీవు భర్తగా ఆమెను ఆనందపరచగలవు. కాని ఆమెకు మాతృత్వాన్ని ఇవ్వలేవు. అది నాకు తెలుసును'

దశరథ్ ఉలిక్కిపడ్డాడు. ఫౌంటిన్ పెన్‌కు క్యాపు పెడుతూ డాక్టరు—నీవు ఎవరి దగ్గర పరీక్ష చేయించుకొన్నావు? అని అడిగాడు.

'నేను పరీక్ష చేయించుకొన్నానని మీ కెవరు చెప్పారు'?

నన్ను అవన్నీ అడగకు, నా ప్రశ్నకు జవాబు చెప్పు!'

'డాక్టరు బిల్ దగ్గర'

'అతడు మంచి డాక్టరు. సమర్థుడు. ఆయన నిర్ణయం తప్పుగాదు'

'విషయం తేలింది గదా? ఇక నీవు ఏమి చేయ దలచుకొన్నావు?

'డాక్టరు గారూ! నే నీ విషయం అవంతికి చెప్పలేదు. నేను డాక్టరు పరీక్ష చేయించుకొన్నాను, డాక్టరు బిల్ నేను తండ్రిని కాలేనని చెప్పాడు.'

'మరి? ఇప్పుడేమి చేయాలి?'

నేను ఇప్పటి వరకూ అవంతిని పరీక్ష చేయించు కోకుండా ఆపాను. తల్లిగావలెననే ఆమె కోరికను అర్థం చేసుకొని గూడా ఆమెకు నిజాన్ని చెప్పలేక పోయాను. నిజం చెప్పితే మా దాంపత్య జీవితం చెడిపోతుంది. అవంతి అంటే నాకు చాలా యిష్టం. ఆమె సంస్కారం గలిగిన స్త్రీ'.

'అవును'

'మీరేదైనా మార్గం చూపిస్తారా?'

'ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్'

'ఛీ ఛీ ఛీ'

'దానిలో ఛీ అనడానికేమున్నది. అది అంటు బెట్టిన మామిడి వంటిది'

'డాక్టరు గారూ! ఒక మురికి బీజంతో నా పూలతోటను నేను అలంకరించుకోలేను. ఈ లోకంలో అనేక మంది సంతానంలేని దంపతులు న్నారు. ఈ ఆశలోనే అవంతిని ఇంకొక పది సంవత్సరాలు వుంచుదామనుకొంటున్నాను. అది విశ్వాసఘాతుకత్వం కావచ్చును'.

'నేనింకొక ఉపాయం సూచిస్తాను'

'పెంపుడే గదా?'

'కాదు'

'మరి?'

చూడు, దశరథ్! నీ విషయంలో నాకు ఇంకా ఆశవున్నది. నా దగ్గర ఒక ఇంజక్షనున్నది. నేను ఇంజక్షన్ చేసిన రోజున నీవు అవంతికతో భర్తగా వ్యవహరించు.

ఆ ఇంజక్షన్ రామబాణమని నేననను. అది సఫలం గూడా కావచ్చును. అవంతిక సంతోషం కొరకు ఆ ప్రయత్నం చేయడం మంచిదని నా అభిప్రాయం'

'ఐడియా బాగానే వున్నది'

'ఆమెను గూడా మానసికంగా తయారు చేయాలి. ఇక నీవు చింతించకు. అవసరం రాగానే నేను నిన్ను పిలుస్తాను'

దశరథ్ ఇంటికి వచ్చాడు. అవంతిక ఉదాసీనంగా కూర్చొనివున్నది. ఈ రోజు డాక్టరు ఒక మంచి విషయం చెప్పాడన్నాడు.

మంచి విషయం అనగానే అవంతిక కొంత స్వస్థ చిత్తురాలయింది 'ఏమిటి అది' అని అడిగింది

దశరథ్ అవంతికను పడక గదిలోకి తీసుకెళ్లారు. ఆమెను కౌగిలిలోకి తీసుకొన్నాడు. ముద్దుల వర్షం కురిపించారు.

'విషయం ఏమిటో చెప్పలేదు' అన్నది

'ఇక నీవు తల్లి వవుతావు. డాక్టరు గారు అందుకొక ఉపాయం ఆలోచించి పెట్టారు'

'ఏమిటి ఆ ఉపాయం'?

'అది నాకు తెలియదు, నీకు చెపుతారు'

'ఎప్పుడు?'

అది కూడా తెలియదు. ఎక్కువ రోజులు పట్టదన్నారాయన. ఇంతకాలం ప్రకృతి మీద ఆధార పడ్డాము. ఇక విజ్ఞాన శాస్త్రాన్ని అనుసరిస్తాము.

అవంతిక దశరథ్ అసలు సంగతి దాచిపెడుతున్నాడని అర్థంచేసుకొన్నది. అయినా ఆమె ఆనందపడింది.

ఒక వారం తరువాత డాక్టరు గారి ఫోను వచ్చింది. అవంతిక డాక్టరుగారి ఆస్పత్రికి చేరింది. సరిగా పది గంటలకు ఆమె మీద కృత్రిమ గర్భధారణ ప్రయోగం జరిగింది. లోలోపల తను చాలా నీచురాలనని ఆమె భావించింది. కాని అది జరగక తప్పదు.ఈ రోజు సాయంత్రం దశరథ్‌ను వొంటరిగా ఇక్కడికి పిలిపించాను. నీవు రావద్దు. రాత్రి అతనికి బాగాసహకరించు...అని అవంతిక వీపుతట్టి డాక్టరు కాబిన్ బయటికి వెళ్లాడు. ఆమెకు మాట్లాడడానికి అవకాశమివ్వలేదు. అవంతిక చాలా సిగ్గుపడింది. నెమ్మదిగా ఇంటికి వెళ్ళిపోయింది.

సాయంత్రం దశరథ్ డాక్టరు గారి ఆస్పత్రికి వచ్చాడు.

డాక్టరు ఇంజక్షనిచ్చాడు. దశరథ్ ఆశగా ఇంటికి వచ్చాడు. భోజనమయింది. భార్యాభర్తలిద్దరూ కారులో సముద్రం వొడ్డుకు వెళ్ళారు. రాత్రి పదిగంటలకు ఇంటికి వచ్చారు. ఆ రాత్రి వారిద్దరికీ చాలా ఆనందంగా గడచింది.

రోజులు గడచినవి, నెలలు గడచినవి. ఒక రోజు ఉదయం పదిన్నర గంటలకు అవంతిక ఒక మగ శిశువును కన్నది. ఆమె ఆనందానికి అంతు లేదు. దశరథ్ ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. రాత్రికి అతడు డాక్టరు గారింటికి వెళ్ళాడు. వివరం చెప్పాడు.

మహదానందంలో కొన్ని సంవత్సరాలు గడచినవి. పిల్లవాడికి విద్యుత్ అని పేరు పెట్టారు. పిల్లవాడు తల్లిలాగే చలాకీగా ఉన్నాడు. అవంతిక తనను తానే మరచిపోయి విద్యుత్ పరిచర్యలు చేస్తున్నది. ఆమె ఇంటినుండి బయటికే పోదు. దశరథ్ అవసరాలు నౌకర్లు చూస్తున్నారు. ఆమెకు పిల్లవాడిదే ప్రపంచం'

ఒకరోజు విద్యుత్ అవంతిక వొడిలో నిద్ర పోయాడు. పిల్లవాణ్ణి కన్నులార్పకుండా చూస్తు న్నది. అకస్మాత్తుగా అతని అసలు తండ్రి ఎవరో నన్న ఆలోచన ఆమె కొచ్చింది. ఎవరిబీజం ఇంత మంచి పరిణామాన్ని కలిగించిందో అతడెవరో తెలుసుకుందామని ఆమెకు తీవ్రంగా కోరిక కలిగింది. డాక్టరుకు ఫోన్ చేసింది. ఈ రోజు మీ ఆస్పత్రికి వస్తున్నానన్నది.

'రా'

అవంతిక ఆస్పత్రికి వెళ్ళింది.

డాక్టరు ఆమెను లోపలికి పిలిచారు. సుఖంగా వున్నావు గదా! భగవంతుడికి నమస్కరించు అన్నాడు.

భగవంతునితోబాటు విజ్ఞానశాస్త్రానికి గూడా నమస్కారమన్నది.

విద్యుత్‌కు ఐదు సంవత్సరాలు నిండాయి. పిల్లవాడు చాలా బాగున్నాడు. నా అవతారంగా వున్నాడు. అయినా ఒకలోటు—

ఏమిటది?

'విద్యుత్ ముక్కు, ముఖాకృతి చూడగానే మార్పు కనిపిస్తుంటుంది. డోనరు ఎవరో తెలుసు కుందామనిపిస్తున్నది'

'అది జరగదు'

'అంత కాఠిన్యమెందుకు డాక్టర్'

'నేను డాక్టరును. డాక్టరు అనుసరించవలసిన ధర్మం అదే'

'ఒక్కసారి డాక్టరుగారూ! అతణ్ణి దూరం నుండి చూపించండి. ఆయన గారిని నేను కలుసు కోను. నేను గూడా బాధ్యత కలిగినదాన్ని. భార్యను. ఇప్పుడు తల్లిని గూడాను'అన్నది

'అది నిజమే. కాని నీకోరిక తీర్చడం సాధ్యంకాదు' డోనర్ విషయం మేము జ్ఞాపకం పెట్టుకోము'.

ఎంతో విచారంగా ఇంటికొచ్చింది. విద్యుత్‌ను ముద్దుపెట్టుకొన్నది. వేరు వేరుగా తీసిన విద్యుత్ ఫొటోలు ముందు పెట్టుకొని కూర్చున్నది. ముక్కు, కళ్లు అన్నీ తీవ్రంగా పరీక్షించింది. అనేక ముఖా కృతులు ఆమె కళ్లముందు కొచ్చాయి. ఏవీ కలవ లేదు. బీజాన్నిచ్చిన వ్యక్తిని చూడవలెననే ఆమె కోరిక కట్టలు తెంచుకొంటున్నది. ఆమె పిచ్చిదై పోతున్నది. డాక్టరుకు ఫోను చేసింది. తన కోరికను మన్నించమని బతిమలాడింది.

డాక్టరు వినిపించుకోలేదు.

అతడెవరో మీకు తెలుసు. నాకు చెప్పడానికి వెనుదీస్తున్నారన్నది.

'అమ్మాయీ! ఎక్కువ తెలివితేటలు చూపిం చకు. నీకెందుకు సహాయం చేశానా అని పశ్చా త్తాప పడుతున్నాను' అన్నారు డాక్టరు.

డాక్టరు గారి మాటలు వినగానే అవంతిక ఫోను మీదనే పెద్దగా ఏడ్చింది. అవంతికా! నా మాట విను. బీజమిచ్చిన వ్యక్తిని చూడగానే దశ రథ్‌ను నీవు పూర్వం లాగా ప్రేమించలేవు. బీజ మిచ్చిన వ్యక్తి మీదకు నీ మనస్సు పోవచ్చును. మీ దాంపత్య జీవితం పాడై పోతుంది. నీ మంచికి చెపుతున్నాను విను అన్నాడు.

అవంతిక ఫోను పెట్టి వేసింది. కొన్నిరోజులు గడిచినవి. విద్యుత్ పుట్టినరోజు వచ్చింది. డాక్టరు గారింటికి ఆశీర్వాదం కొరకు పిల్లవాణ్ణి తీసుకొని పోయింది. డాక్టరు గారింట్లోఅందరూ అవంతికకు పరిచితులే. ఎందుకో అవంతి రాక డాక్టరుకు నచ్చలేదు.

ఇంతలో తలుపు గంట మోగింది. తలుపు తెరవగానే సూటు బూటులో వున్న ఒక వ్యక్తి లోపలికి వచ్చాడు.

అవంతిక ఆ వ్యక్తిని తేరిపార చూచింది. ఆ వ్యక్తి దృష్టి విద్యుత్ మీద పడింది. అతడు ఆశ్చర్యపడ్డాడు. తిరిగి అవంతికను చూచాడు— విద్యుత్‌ను చూచాడు. అతని కర్థమయింది- అవంతికకు గూడా అర్థమయింది. ఇద్దరూ నిశ్చేష్టులుగా ఉన్నారు. ఏదో గురుత్వాకర్షణ.... ఏదో విచిత్రానుభూతి ....

డాక్టరు బయటకు వచ్చాడు. ఇద్దరినీ చూచి ఉలిక్కిపడ్డాడు. అవంతికా! లోపలికి పో. మీ పిన్ని పిలుస్తున్నదన్నాడు.

రెండు జాములైన తరువాత అవంతిక డాక్టరుకు ఫోను చేసింది.

'జరగ గూడనిది జరిగిందన్నాడు' డాక్టరు

'జరగవలసింది జరిగింది' అన్నది అవంతిక

'అతడు నా మిత్రుడు'

'కావచ్చును'

'నీవతణ్ణి చూచావు. అతని విషయంలో బాధాకరమైన విషయం ఒకటి విను.'

'చెప్పండి'

'విద్యుత్‌ను ప్రసాదించిన ఆ వ్యక్తికి భగవంతుడు అపకారం చేశాడు.'

'నా కర్థం గావడం లేదు'

'అతని భార్య సంతానానికి నోచుకోలేదు. పనికిరాదు. ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్ గూడా ఆమె విషయంలో పని చేయలేదు.'

అవంతిక ఆశ్చర్యంగా విన్నది. డాక్టరు టెలిఫోను పెట్టివేశారు. అవంతిక మస్తిష్కంలో పెద్దతుఫాను రేగింది—

విద్యుత్ ఆగంతుకుడు. బీజమిచ్చిన వ్యక్తి ఆగంతుకుడు. దశరథ్ ఆత్మీయుడు. కాని తాను? ఎక్కడున్నది? ఎవరిది?

గ్లాసు వెనక ఫోటో వున్నది. తాను ఫోటోను చూడగలదు. కాని తాకలేదు. చేతితో స్పృశించలేదు. గ్లాసును పగల గొట్టితే—ఫోటోను తాకగలదు, కాని తాను నిరుత్తరురాలే. స్పందనా రహితురాలే .........

# మందార మాల

## ఆధునికాంధ్ర కవిరాజు- శ్రీ అడవి బాపిరాజు

__ ధూర్జటి వేంకట బాలాజి

'అతడు గీసిన గీత బొమ్మై
అతడు పలికిన పలుకు పాటై
అతని హృదయములోని మెత్తన
అర్థవత్కృతియై,......'

అని విశ్వనాథ వారు పలికినట్లుగా బాపిరాజు బొమ్మలలో పాట వినిపిస్తుంది. పాటలలో బొమ్మ కనిపిస్తుంది. తన పటిష్ఠమైన భావధారతో,వినూత్నమైన శబ్దజాలంతో అందమైన బొమ్మలనుకట్టి మన కళ్ళెదుటపెట్టాడు. నాకు నిజంగా బాపిరాజు గారిని గురించి తలచినప్పుడు విశ్వసాహిత్యంలోని గెటే, మైకిల్ యాంజిలో వంటి మహానుభావులు గుర్తుకొస్తారు. కవి- చిత్రకారుడు కాలేడు, చిత్రకారుడు కవి కాలేడు'అన్నాడు బెర్నార్డుషా.ఆ మాటలు మన బాపిరాజు పట్ల వ్యర్థమైనాయి కదా!

బాపిరాజు గారు తెలుగులు గర్వించదగిన చిత్రకారుడూ- కవీని. వారికి కవిత్వం ఒక తపన- చిత్రలేఖనం ఒక తపస్సు. బాపిరాజు యీ రెండింటిలో ఉన్నత శిఖరాలను దర్శించడానికి ఒకవైపు ఆస్వాల్ట్ జె. కూల్ట్రి దొర, మరొకవైపు ప్రమోద కుమార ఛటోపాధ్యాయ ప్రత్యక్ష సాక్షులు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాలాధ్యక్షుడగు కూల్ట్రిదొర దామెర్ల, కవికొండల, బాపిరాజులకు ఉత్తేజమిచ్చిన గురువు. వారి ప్రభావానికి దాసోహమని దామెర్ల చిత్రలేఖనంలో వన్నె తేరితే, కవికొండల ప్రకృతి కవిత్వంలో రాటుదేలితే యీ రెండింటినీ తనలో యిముడ్చుకోగలిగాడు బాపిరాజు. వీరికి గురుకులం రాజమండ్రి ప్రభుత్వ కళాశాల!

ఆంధ్ర సాహిత్యంతో పాటు ఆంగ్ల సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివి జోరుగా కవిత్వంరాసే తెలుగు యువకవులకు గురజాడ ఆదర్శప్రాయుడయ్యాడు. కారణం:- ప్రాచీన సాహిత్యంతో విసిగి వేసారిన వాళ్ళకు, గురజాడ రచనా ధోరణిలో క్రొత్తదనం కనిపించింది. అందుకే వారందరూ గురజాడ వారి మార్గాన్ని వరించి, ఆయనను ఆధునిక కవితకు వాల్మీకిగా చిత్రించి ఆ ధోరణిలో రచనలు సాగించారు. గురజాడ కవితా ధోరణి వారి వరకు బాగున్నా, వారి ననుసరించిన రాయప్రోలు వంటి భావకవులకు రుచించలేదు. కారణం- గురజాడ వలె వారు కూడా దేశికవితా ఛందస్సునే స్వీకరించినా, కావ్యేతి

వృత్తం, రచనా ధోరణులు మటుకు మార్గ కవితా ప్రవృత్తికి దగ్గరవడంచేత.

కానీ–చింతాదీక్షితులు, కవికొండల, బాపిరాజులు మటుకు గురజాడను దేశికవితారీతిలో అచ్చుగుద్దినట్లు అనుసరించారు. అందుకే బాపిరాజు చేతినుండి జానపద సాహిత్యం, కవికొండల నుండి ప్రకృతి పరమైన సాహిత్యం, దీక్షితులు గారి చేతి నుండి బాలసాహిత్యం ఉద్భవించాయి.

ఆధునిక సాహిత్యావిర్భావ వేళలలో తనదైన గొంతుకను విప్పి జానపదసాహిత్యాన్ని ఆకళించుకొని, ఆ రీతిలో పాటలు కట్టి తెలుగు సాహిత్యానికి వెలుగుకూర్చిన బాపిరాజుగారు నూటికి నూరుపాళ్ళు జానపద కవి. జానపద జీవ ధర్మాన్ని తన కావ్యాత్మగా వినిర్మించిన సాహిత్యపు బాటసారి ఆయన.

స్థూలంగా చూసినప్పుడు–బాపిరాజు గారి కవితాస్వరూపం మనకు రెండురకాలుగా సాక్షాత్కరిస్తుంది. ప్రకృతికాంత తనను ఆకర్షించినప్పుడు పరవశుడై జాలువార్చిన కవితాధారలు ఆయన బాహ్యరూపమైతే, జానపదుల నాడిని అందుకొని వారికొఱకు రచనలు గావించడం ఆయన అంతరూపం. నిజానికి బాపిరాజు గారి పాటలలో జానపదుల నిట్టూర్పులు వినిపిస్తాయి. ఇదంతా కూల్ట్రి దొరగారి చలవ.!

తెలుగు కవిత్వానికి పట్టుకొమ్మ జానపద సాహిత్యం. జానపదుల జీవితం ఎంత చిత్రంగా ఉంటుందో వారి సాహిత్యం కూడా అంత అనుభూతినిస్తుంది. పంట కోసేటప్పుడు పాడే పాటలు, పంట నూర్పిళ్ళప్పుడు పాడే పాటలు, దంపుళ్ళ పాటలు, ఏలపాటలు, పల్లెపాటలు, పడవపాటలలో జానపద సాహిత్యం వరదలా ప్రవహిస్తుంది : ఆ నాడిని పట్టుకొన్న బాపిరాజు గారు తన కవిత్వంలో ప్రేమను, కరుణను, శాంతాన్ని వ్యక్తం చేశారు. ఆయన కవిత ఏది చదివినా, మనసు వెళ్ళబోసినట్లుంది. బాపిరాజు జానపద సాహిత్యం చదివితే, విశ్వనాథవారన్నట్లు బాపిరాజు గారికి గల భావనాపటిమ నేటికవులకు లేవనడం నిస్సంశయం.

బాపిరాజుగారు జానపదుల జీవితంలోని అమలిన శృంగారాన్ని వ్యక్తం చేయడంలో బాగా కృతకృత్యులయ్యారనే చెప్పాలి. జానపదులకు నిండైన పరమ పవిత్ర ప్రేమేతప్ప, కపట ప్రేమ అంటే ఏమిటో తెలియదు. ఆ ప్రేమనే తమ 'గోధూళి' కావ్యంలో ఒక ప్రియునిచేత పలికిస్తారిలా :

'వలపునే బిచ్చమడిగితి
తలపులా కాన్కలడిగితి
నిలవలేనే నిన్ను కలలు గంటూ
తులసీ చిన్నారి పడుచా
విలువలేనీ బ్రతుకు నాదేనే'

ఆ ప్రియుడికి వలపుకావాలి. ఆ వలపు ఇవ్వదగింది పల్లెపడుచు. అందుకే ఆ పడుచువలపును బిచ్చంగా భావించి అర్థిస్తున్నాడు. తలపులే అతనికి విలువైన కానుకలవ్వుడు.

మరొకచోట ఒక పల్లెపడుచు తనకు దూరమయ్యే మగడికి వీడ్కోలిస్తూ ప్రేమనిండిన కళ్లతో, శూన్యపు దృష్టితో.

సీకూ నాకూ దూరమైతే
నీలి కొండా లడ్డమైతే
ఇంటికాడ సీ సిన్నాదాన్ని
కంటికెదురా తలపావోయీ !'

అని అంటుంది. భర్త ఎక్కడికో వెళ్తున్నాడు. వెళ్ళే భర్త తనకు కొంతకాలం కానబడడు. కానీ ఆ బాధను తనలోనే దిగమింగి భర్తపరంగా పలుకుతున్నది ఆ పల్లెపడుచు. 'ఇంటిదగ్గర చిన్న దాన్ని మటుకు కళ్ళకెదురుగా ఉన్నట్టు భావించ వోయ్ మగడా!' అనే అర్థాన్ని ద్యోతకం చేశారు బాపిరాజు గారు ఆ పల్లెపడుచు ద్వారా.

బాపిరాజుగారి గేయాల్లో 'ఉప్పొంగి పోయింది గోదావరి-తాను తెప్పున్న ఎగిసింది గోదావరి' అనే గేయం సుప్రసిద్ధమైంది. 'తెప్పున్న ఎగిసింది గోదావరి' అనే గేయం ఒక ప్రళయకాల సంకేతంలా నిలిచిపోతుంది. 'నను చూసి నవ్వింది-దేసోళ్ళ చిన్నది' అనేప్పటికి బాపిరాజుగారి బోళాతనం అర్థమౌతుంది.

బాపిరాజుగారి జానపద ధోరణి యిలాఉంటే యిక ప్రకృతిమీద వల్లమాలిన చెలిమితో కళాత్మక మైన సంఘటనలకు పరవశించి రాసిన కవిత్వం ఆయన ఆంతర్యరూపం కావచ్చునేమో!

నాకు శశికళంటే విదియనాటి చంద్రుడు గుర్తుకు వస్తాడు విదియనాటి చంద్ర రేఖను చూస్తే ఒక గొప్ప చిత్రకారుని చేతినుండి వచ్చిన చిత్రరేఖలా కనిపిస్తోంది. 'ఇంతకూ ఎవరీ శశికళ? నా ఆశయమూర్తి, నా ఆత్మ పూజాపీఠస్థ కళాలక్ష్మి' అని ఆయనే చెప్పుకొన్నాడు. శశికళ ఆయన కళాధిదేవత. ఆనాటి కవులలో కొంతమంది ఇష్ట కళామూర్తులున్నారనుకొన్న ప్పుడు- విశ్వనాథ వారి 'కిన్నెరసాని'- కృష్ణశాస్త్రి గారి- 'ఊర్వశి'- శివశంకరశాస్త్రి గారి 'హృదయే శ్వరి' జ్ఞాపకమొస్తారు. అందుకే కాబోలు శశికళను గూర్చి 'నా బ్రతుకు శృతి కలిపి వలపించు సతివి- చతురవు దేవీ' అన్నాడాయన. ఇంతగా తనకు ప్రాణభూతమైన శశికళను గూర్చి 'శశికళ' కావ్యంలో ఒకచోట

> 'కావ్యనాయిక నాకు శశికళ
> కావ్యరసమున స్థాయి శశికళ
> కావ్య వ్యంగ్యము రీతి శశికళ
> కావ్యమే నా గీతి శశికళ'

అన్నాడు.

బాపిరాజుగారి కవిత్వంలో భావకవితా వాయు వులు, జానపదుల ప్రేమలు, విరహాలు, పరిహాసాలు నిరాడంబర జీవితం పుష్కలంగా ఉన్నట్లే దేశాభి మానం వ్యక్తం చేసే గేయాలు, అభ్యుదయపరమైన భావాలతో కూడుకొన్న రచనలు మిక్కుటంగానే కనిపిస్తాయి. ఇంతకూ బాపిరాజుకవి ఏ పరమా ర్థాన్ని కోరి, కళలను, కవిత్వాన్ని ఉపాసించాడు! సౌందర్యరేఖలో, శబలవర్ణాలలో నారాణిమూర్తింప నాదీక్షలన్నాడు. నృత్తనృత్యాలలో వృత్తిలో చారలో దేవి నీకై అది నీకాదు' అని పలికాడు. నిజానికి, అధునాతన ఆంధ్రకవులలో అంతవిస్తృతంగా లేఖిని చాలనం చేసింది బాపిరాజు ఒక్కడే!

ఆనాడు క్రొత్తగా వచ్చిన కథానికా ప్రక్రియలో కూడా బాపిరాజు తన మేలిమితో రాణించాడు. నిజానికి భావాత్మకమైన కథలు రాయడంతో బాపిరాజు కలం పదునైనది. భాష శిష్ట వ్యావ హారికం. కథలలో వర్ణనలు, భావనలు, కల్పనలు, విశిష్టమైన స్థానమాక్రమించాయి. సహజంగా బాపిరాజుగారికి కొండలన్నా, నదులన్నా, ప్రకృ తన్నా అంత యిష్టం. కాబట్టే, తన కథలకు 'తిరుపతి కొండమెట్టు, శైలబాల, భోగీరలోయ' అని పేర్లు పెట్టుకొన్నాడు. ఇందులోని హరిజనుడు నరసన్న. సంఘం అతనికి కలిగించిన బాధను, ముఖ్యంగా అగ్రవర్ణస్థులు అణిచిపెట్టిన హింస లను రచయితగా ప్రతిఘటించాడు బాపిరాజు.

తరువాత 'తిరుపతి కొండమెట్టు' కథలో పున్నెడు ప్రధానపాత్రధారి, కథానాయకుడు. జీవితంమీద రోసి, జీవితాన్ని ఆహుతి చేసుకోబోయే సమయంలో యింకో బిచ్చగత్తె వచ్చి పున్నెణ్ణి కాపాడి జీవితం మీద ఆశ కలిగిస్తుంది.

మిగిలిన కథల కన్నా విలక్షణమైన కథ 'శైలబాల'. బాపిరాజు తనలోని కళామూర్తికి సృష్టించుకొన్న ప్రతిరూపం శైలబాల. ఇందులోని నాగచంద్రుడు ఎవరో కాదు. రచయిత బాపిరాజు గారే. బాపిరాజు గారి కథలు చదువుతూంటే, యం.బి.మూర్ అన్న 'Litirature was written not to be studied but to be enjoyed' మాటలు జ్ఞప్తికొస్తాయి.

కవిగా, కథకునిగా కంటే బాపిరాజు గారు గొప్ప నవలాకారులు. తాను సృష్టించిన 'గోన గన్నారెడ్డి, హిమబిందు, అడవి శాంతిశ్రీ' వంటి చారిత్రాత్మక నవలలు, 'నారాయణరావు, తుఫాను, జాజిమల్లె, కోనంగి' వంటి సాంఘిక నవలలు, ఆయన్ను గొప్ప నవలాకారుణ్ణి చేశాయి. గోన గన్నారెడ్డి నవల కాకతీయుల నాటి కథను తీసుకొని వ్రాయబడింది. కాకతీయ నాయకులలో అగ్రగణ్యుడు గోన గన్నారెడ్డి. అతని ప్రేమికురాలు అన్నమ్మ. అతడు చేసిన సాహస కృత్యాలు రుద్రమ్మ రాజ్యస్థితికి మూలస్తంభాలుగా నిలబడ్డాయి. ఒక విధంగా చెప్పాలంటే బాపిరాజు గారి శిల్పకళ అవధుల్ని దాటింది.

'నారాయణరావు' కేవలం సాంఘిక నవల. ఇందులోని పాత్రలను బాపిరాజు గారు తన నిజ జీవితంలో తారసిల్లిన సాహితీ ప్రియులను స్నేహితులను దృష్టిలో పెట్టుకొని చిత్రించి ఉంటాడు. దీన్నొక ఉత్తమ నవలగా భావించి ఆంధ్ర విశ్వవిద్యాలయం సత్కరించింది. తరువాత యీ నవలనే కొంతకాలానికి రేడియో నాటికగా నాటకీకరించాడు. బాపిరాజు గారి నవలలంటే విరగబడి వెఱ్ఱిగా చదివే పాఠకజనం ఆ రోజుల్లో ఎక్కువమంది ఉండేవారు.

బాపిరాజు నాటకప్రక్రియను కూడా స్పృశించి రాణించకపోలేదు. ఆయన ఏకాంకిక నాటికలలో 'గుడ్డిపిల్ల' అనే నాటిక చెప్పదగింది. ఇందులోని 'పేరన్న' ప్రేక్షకుల హృదయాలలో శాశ్వతంగా నిలుస్తాడు. 'ఉషాసుందరి, ఏరువాక, దుక్కిటెద్దులు' వంటి ఏకాంకిక నాటికలను రాయడమే కాకుండా, శైలబాల, భోగీరలోయ శైలబాల వంటి కథలను కూడా రేడియోనాటికలుగా మలచి చక్కగా రక్తి కట్టించారు. రేడియోకు పనికివచ్చే నాటికలు రాయడమనేది ఒక ప్రత్యేకప్రతిభ. వీటికి 'ధ్వని' ప్రధానం. పాత్రపోషణ, రసపోషణ జరగాలి. అంటే అది కత్తిమీద సాము వంటిదన్నమాట. ఇందులో ఆరితేరినవారు బాపిరాజు గారు.

కథకుడు-కవి-నవలాకారుడు ఏకాంకికా రచయితైన బాపిరాజుగారు ఏ సిద్ధాంతాన్ని వ్యక్తీకరించడానికో, లేక ఏ ఉద్యమాన్ని దృష్టిలో పెట్టుకొనో సాహిత్యం సృష్టించలేదు. అందుకే సాహిత్యరంగంలో ఆయన రచనా సామర్థ్యాన్ని గురించి అభిప్రాయ భేదాలులేవు. రాజకీయాలు, సాంసారిక జీవితానికి దూరంగా స్వేచ్ఛగా మరొక ప్రపంచాన్ని సృష్టించుకొని వ్యక్తిగతంగా తీక్షణమైన, పరిపూర్ణమైన ఆనందాన్ని అనుభవించడం ఆయన నైజగుణం—ఆయన ఎంత స్వాప్నికంగా భావిస్తాడో అంత లౌకిక చైతన్యస్ఫూర్తి గలవాడు. స్వీయ సౌఖ్యాన్ని త్యజించి కష్టజీవులకొరకు కన్నీటిని నింపుకొన్న కారుణ్యమూర్తి.

ఇంత వైవిధ్యంగల సాహిత్యాన్ని, కళాత్మకమైన జీవితాన్ని తరువాతి తరాలవారికి అందజేసిన

బాపిరాజుగారు నిజజీవితంలో ప్లీడరన్న విషయం చాలా కొద్దిమందికే తెలుసు.

''గోదావరి ఒడ్డున నిలబడి భావుకదృష్టితో ఉప్పొంగే గోదావరిని చూస్తే 'గోదావరి కెరటాలలో బాపిరాజు గారు కనిపిస్తారు' గోదావరి ఒడ్డున నిలబడి 'మట్టిని తాకితే అది సాహిత్యవాసన కొట్టుంది' అని ఒక భావుకుడన్నమాటలు బాపిరాజు గారిపట్ల సార్థకమౌతాయి''


తెలుగు లెక్చరర్,

టీచర్స్ కాలనీ, జనతాపేట
కావలి-524202.


× × ×

# విస్మృత జాతీయకవి చామర్తి రాజశేఖరరావు

— వేముగంటి నరసింహాచార్యులు

తెలుగులో కాల్పనిక కవిత్వపు జిలుగు వెలుగులు తీగలుగా అల్లుకుంటున్న రోజులవి. అదే కాలంలో జాతీయోద్యమం కవుల కలాలను కదలిస్తున్న సమయం. 'దేశమును ప్రేమించుమన్నా మంచి యన్నది పెంచుమన్నా' అంటూ గురజాడ, 'ఏదేశ మేగినా, ఎందుకాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని' అంటూ రాయప్రోలు దేశభక్తి గీతాలను ఆలాపిస్తున్న రోజులు. ఆలాంటి నులివెచ్చని కాలంలో 'మాతృపూజా వేళ మలవబోకమ్మ, పాదాలకడనైన' అనే ఒక దేశభక్తి పూరితమైన యువవాణి వినిపించింది. ఆ వాణి చామర్తి రాజశేఖర రావుది.

చామర్తి రాజశేఖరరావు 1898 సంవత్సరంలో గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా చామర్తి గ్రామంలో జన్మించాడు. ఆయన గుంటూరులోనూ, బందరులోనూ విద్యాభ్యాసం చేసి పట్టభద్రులైనారు. ఆ యా పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా పనిచేశారు. రాజశేఖరరావు పదమూడేళ్ళ ప్రాయంలోనే కవిత చెప్పడం ప్రారంభించాడు. ఆయన కవిత మృదు పదాల కూర్పు, మధుర భావాల తీర్పు కలిగి రమణీయమైన శైలీ విన్యాసంతో రంజిల్లుతూ ఉంటుంది. కాల్పనిక కవితాచ్ఛాయలూ, జాతీయోద్యమ ప్రభావమూ రాజశేఖరుని కవిత్వాన్ని ప్రభావితం చేసినట్లుగా ఆయన పలు కవితా ఖండికలు విశదం చేస్తున్నాయి, చామర్తి కవిత కొంచమే అయినా అది జాతిని ఉత్తేజపరచేదిగా ఉంది. రాజశేఖరుడు జీవించింది 24 సంవత్సరాలు మాత్రమే. అయినా అద్భుతమైన కవిత చెప్పి ఆంధ్ర సాహితీ లోకాన్ని అలరింప చేశాడు.

రాజ శేఖరరావు కవితా సంపుటి 'బృందావనము'ను 1924లో రేపల్లె సాహితీ సమితి ప్రకటించింది. ఈ సంపుటిలో 14 కవితలు మాత్రమే ఉన్నాయి. అయినా కవితలన్నీ హృద్యపద్య రచనలే. ప్రతి కవిత కవి ప్రతిభా విశేషాన్ని ప్రకటిస్తుంటుంది. ఈ సంపుటికి నోరి నరసింహశాస్త్రి చక్కని పీఠిక వ్రాశారు. కాలేజీలో ఏ ఉత్సవం జరిగినా రాజశేఖరుని కావ్యపఠనం తప్పకుండా ఉండేదని నోరి నరసింహశాస్త్రి తెలిపారు. దీన్ని బట్టి చామర్తి కవితా విశిష్టత వెల్లడౌతున్నది.

రాజశేఖర రావు కవితలు ముఖ్యంగా దేశభక్తి భరితాలు, జాతీయోద్యమ ప్రభావితాలు. పంజాబులోని జలియన్‌వాలా బాగులో జరిగిన

దురంతం వల్ల దేశం అట్టుడికి పోతునట్లు ఉడికి పోతున్న రోజులవి. ఆనాడు ఇంగ్లీషువాళ్ళు చేసిన హింసాకాండను గూర్చి రాజశేఖర కవి 'పాంచాలీ పరాభవము' అనే కవితను వ్యంగ్య భంగిమతో వ్రాశాడు. 'పాంచాలి' అంటే ద్రౌపది అనే అర్థమే కాక పంజాబు అని కూడా అర్థం చేసుకోవాలి.

'ధృత రాష్ట్రిం డతి కుత్సితుండు,
కలధాత్రీ నాయకుల్ భీరువుల్
ప్రతికూలంబు జగంబు, కాల పరి
పక్వంబైన యందాక భా
రత సామ్రాజ్య రమాభిలాష దెలుపన్
రాదమ్మ, దుశ్శాస నో
ద్ధతి సైరించునటమ్మ యుత్తమసతీ
ధర్మంబులన్ ద్రౌపదీ!'

ఈ పద్యంలోని పదాలు అర్థాంతర వ్యంజితాలై ఆనాటి పరిస్థితిని చక్కగా స్ఫురింప జేస్తున్నవి. 'ధృత రాష్ట్రిండు' అనే పదం ఆంగ్ల ప్రభుత్వాన్ని, 'భారత సామ్రాజ్యరమాభిలాష' అనే పదం భారతదేశ స్వాతంత్ర్య కాంక్షనూ, 'దుశ్శాసనోద్ధతి' అనే పదం తెల్లవారి దమన నీతినీ ధ్వనింప చేస్తున్నవి.

ఈ దిగువ పద్యాలు కూడా ఆంగ్లేయుల నిరంకుశ పరిపాలనా విధానాన్ని ధ్వనింపజేస్తూ భరత మాతను ఓదార్చే రీతిలో ఉన్నవి.

'చేసేతన్ గడు మూర్ఖులై భరత
లక్ష్మిన్ నిన్ను సాధ్వీమణిన్
గాసిన్ బెట్టిరి ధార్తరాష్ట్రి లకటా!
కాలంబు దాపయ్యె, బా
ధా శోషన్ దిగనాడి యార్య మహిళా
ధర్మంబు పాటించి వే
జీ సంహారము సల్పి, మానడు గదే
నీ సాహసోద్యోగముల్'

'కనుదోయిన్ జడివాలుబాష్పకణ
ముక్తా శ్రేణి పెంపారె, నీ
సుత పాంచాలి పునః పరాభవముచే
శోకించె, జృంభించి దు
ర్జన దోర్దర్పము, దుఃఖితాత్ముల
పరిత్రాణార్థమై ధారుణిన్
జనియింపంగలవాడ నన్న మన
కృష్ణస్వామి రాడాయనే'

'ఆక్రోశము' అనే శీర్షిక కింద వ్రాసిన పద్యాలన్నీ ఆనాటి భారతీయుల బాధలను వ్యంగ్య రీతిలో వ్యక్తం చేస్తున్నవి.

మచ్చుకు రెండు పద్యాలు.

ఎంత దవానలంబు భరియించు
మహెంతటి ఘోరపాతకం
బెంతని మోయు వ్యర్థముగ
నెంతటి భారము శ్రీవసుంధరా
కాంతకు దాపురించె
కలికాలపు బాల్టిక గిల్లకున్న యీ
రంతులమారి పోకలకు
రక్కసి మూకల కంతమక్కటా'

'రావణ కుంభకర్ణులను
రాక్షసనాథులు నేలగూల్చ, దు
ర్భావులు దంతవక్త్రి శిశు
పాలుర విక్రమ మంతరింప, కం
సావనిపుం డడంగ భర
మంతయు వీగునా లేదో కాని ఆ
ర్యావని కష్టజాలముల
కంతము లేదొకో శాశ్వతమ్ముగన్'

'దవానలం' 'రావణకుంభకర్ణులు' 'శిశుపాల దంతవక్త్రిలు', 'కంసుడు' మొదలైన పదాలు ఆంగ్లేయుల దమననీతికి ప్రతీకలుగా కవి ప్రయో

గించాడు. ఈ పద్యాల్లో నాటి భారతీయుల బాధా జాలానికి కవి గుండెలో పొంగిన ఆవేశం, ఆవేదన రూపు గట్టినాయి.

అప్పుడే ఆంధ్రోద్యమం ప్రారంభమైంది. ఆ ఉద్యమానికి స్పందించిన రాజశేఖరకవి 'ఆంధ్ర మాత' శీర్షికతో పద్యాలు వ్రాశాడు. అందులో ఒక పద్యంలో కవి ఆంధ్రులను నిలా ప్రబోధిస్తున్నాడు.

'శ్రీరాజిల్ల సమస్త దేశములు
వాసింగాంచి ఐశ్వర్య వి
స్తారోదారములై నవంచు మదిలో
జర్చించి యెట్టెట్టులో
యారంభించి వారలై తిరి గనా
ఆంధ్రోద్యమం బిప్పుడా
ప్రారబ్ధారనితాంత నిర్వహణ
భారం బెల్లు సైరింతురో'

రాజశేఖరకవి దేశభక్తి పూరిత కవితలేకాక మరెన్నో రసవంతాలైన కవితలు కూడా సంతరించాడు. "వసంత కుసుమము" అనే కవితా గీతము రమణీయ భావరంజితమై సహృదయ హృదాయాలను ఆకర్షిస్తుంది. ఉదాహరణకు కొన్ని పంక్తులు

'అంటిన మాత్రాన నడగునో తేకు
చేత బట్టిన మాత్ర జెదరునో దళము
తాకి యాఘ్రాణింప దఱుగునో తావి
మలిన మై వసివాడి గుయునో సొబగు
రామణీయక మింక రచియింప నగునె'

ఈ లాంటి సరళ సుందరమైన కవితతో తెలుగు సాహితీ సరస్వతిని పులకింపజేసిన చామర్తి రాజశేఖరకవి నిండా ఇరవై నాలగేండ్లైనా నిండకుండానే దివంగతుడు కావడంతో ఆంధ్రసాహిత్య లోకంలో తీరనిలోటు ఏర్పడింది. ఈ కవిశేఖరుని కవితలు 'వైతాళికులు' వంటి భావకవుల కవితా సంకలనాలలో చేర్చక పోవడం, కాల్పనిక కవితను గూర్చి విమర్శనలు వ్రాసిన గ్రంథాలలోనూ, వ్యాసాలలోనూ రాజశేఖరుని పేర్కొనక పోవడం విచిత్రంగా తోస్తుంది.

చామర్తి రాజశేఖర కవి మృతికి శేషాద్రి రమణ కవులలో ఒకరైన కీ.శే. దూపాటి వేంకట రమణాచార్యులు గారు వ్యథాభరిత హృదయంతో చెప్పిన పద్యం ఒకటి ఈ దిగువ ఉటంకించబడుతున్నది.

కలకలలాడు నీ నగు
మొగం బిక గానగరాదు, భావ మం
జులమగు నీదు కైత చెవి
సోకదు మాకిక, నిప్రశాంత పే
శల రమణీయమూర్తి కన
జాలు నదృష్టము కల్గదింక నీ
చెలిమికి బాష్పతర్పణము
చేసెద గైకొను రాజశేఖరా!

సిద్దిపేట-502103.

× × ×

# పాల్కురికి సోమన్న బసవ పురాణము

డా॥ కె.బి. రాజేంద్రప్రసాద్

ఆంధ్ర సాహిత్య ప్రపంచాన పాల్కురికి సోమనాథకవి విలక్షణమైన కవి పుంగవుడు.

భాషలోను, భావంలోను, కథావస్తువులోను, కావ్య రచనలోను ఈ మహాకవి విశిష్టుడే. శైవ సాహిత్యాన్ని అందించినవారిలో విప్లవ కవిగ కూడ ఈయనను పేర్కొనవచ్చును. మతోద్ధరణకు, మత ప్రచారానికి సాహిత్యాన్ని పరమ సాధనంగా స్వీకరించి సఫలీకృతుడైనాడు. వీరశైవ మత స్ఫూర్తితో, నిండారిన ఆవేశంతో ఈ మహాకవి వెలయించిన కావ్య కుసుమాలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి. ఇన్ని కావ్యాలను వెలయించిన ఘనత అనంతర కాలంలో ఒక్క శ్రీనాధునకే దక్కుతుందేమో. వీరశైవ సాహిత్యానికి సృష్టికర్త మల్లికార్జున పండితుడుకాగ, పాలన కర్త, ఉద్ధారకుడూను పాల్కూరికి అనే చెప్పాలి. ఈ మహాకవి వెలయించిన బసవ పురాణ కావ్యాన్ని సమీక్షించడమే ఈ వ్యాస ముఖ్య లక్ష్యం.

బౌద్ధ జైన మతాలను నీరు కార్చే ప్రయత్నంలో వైదికం అంతటా విస్తరించింది. కాని కొంత కాలానికి విభక్తమై శైవ వైష్ణవములుగా వీనిలో శైవం రూపుదిద్దుకొంది. కొన్ని విశిష్ట సంస్కృతీ సంప్రదాయాల్ని ఏర్పరచుకొంది. శివభక్తి దీక్ష, జంగమభక్తి, విభూతి రుద్రాక్ష ధారణం, లింగధారణం, పంచాక్షరీ మంత్రం, యజ్ఞయాగాది కర్మల తిరస్కారం, వర్ణాశ్రమ విభాగ తిరస్కారం, భవుల తిరస్కారం మొదలగు కొన్ని లక్షణాలను కల్గింది. అష్టావరణములు-పంచాచారములు షట్స్థల సిద్ధాంతం వీరశైవంలో ప్రముఖ స్థానాన్ని అందినాయి. దేహమే దేవాలయం అనే భావన వీరశైవులలో స్పష్టపడుతుంది.

పాల్కూరికి సోమనాథుడు ఈ వీరశైవ లక్షణాలను 'తు.చ' తప్పకుండ తన సాహిత్యంతో సమన్వయ పరచి వెలయించడం విశేషం. సోమన్న కాలానికి సాహిత్యం సామాన్యులకు దురవగాహమై పోయింది. ప్రౌఢ సారస్వతం ఆధిపత్యం వహిస్తోంది. మార్గ కవిత ఎక్కడ చూచినా మహోన్నతంగా కొనసాగుతోంది. దేశి కవిత సన్నగిల్లింది. ఈ పరిస్థితిలో సోమన్న దేశికవితా సంప్రదాయాన్ని అనుసరించడం సాహసమే కాదు సమంజసం కూడాను.

బసవ పురాణం ఏడాశ్వాసాల చక్కని శైవ కావ్యం. ఇందు బసవేశ్వరుని చరిత్రతోపాటు వీర శైవభక్తుల కథలు కమనీయంగా వర్ణింపబడ్డాయి. పూలలో దారంలాగ బసవన్న జీవితం-శివభక్తి కథలను ఏకంచేసి ఏక సూత్రతను సాధించాయి. వస్త్వైక్యాన్ని బహు చక్కగా సాధించడం జరిగింది.

బసవ పురాణం ద్విపద కావ్యం. 6,304 ద్విపదలు కల్గియున్నది. అనగా 12,608 ద్విపద పాదములన్న మాట. సంస్కృత సాహిత్యంలో అనుష్టుప్ ఎలా పాడుకోవడానికి వీలుగవుంటుందో తెలుగులో ద్విపద కూడ అలాంటిది. ద్విపద క్రొత్తదికాదు. పాకురవాఙ్మయం వరకే యిది పరిమితిని పొంది వుంది. నన్నయ్యాదులెవ్వరూ దీన్ని గ్రహించలేదు. ఫలితంగా పండిత అనాదరణీయమైంది. సోమన్న ఈ దేశీయచ్ఛందమును కావ్య రచనకు స్వీకరించడం జరిగింది. అంతేకాదు! "ఐహికాముష్మిక ద్విపద హేతువగుట ద్విపదగాక వలుగు" (పండితారాధ్య చరిత్రము)నని అంటాడు. ఇహము-పరము అనే రెండు గతులలో సౌఖ్యావహం కావుననే 'ద్విపద' అనే అన్వర్థనామాన్ని ఈ ఛందం పొందిందని వక్కాణిస్తాడు.

ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట

గూర్చెద ద్విపదల గోర్కి-దైవాఱ
(బ.పు.—ఆ. 1–165 నుండి 168)

అంటాడు. ఇట్లే సోమన్న చేతిలో ద్విపద బహుగతులు నడచి, వింత సోయగాన్ని సంతరించు కొని, కావ్య గౌరవాన్ని అందుకొని, సాహిత్య రసజ్ఞులకు సంభావ్యమైంది.

సోమన్న స్పష్టమైన కవిత్వాశయాల్ని కల్గి వున్నాడు. రసవదలంకారాలు—కావ్య గుణాలు-రస సముచిత వర్ణనలు కావ్యాలకు అవసరమనే ఈయన విశ్వాసం.

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయకాదె కవి వివేకంబు'
(బ.పు. ఆ. 1-170) అంటాడు.

ద్విపదను అనాదరించే పండితలోకాన్ని దృష్టిలో వుంచుకొని పై విషయాన్ని కవి ప్రకటిం చాడేమో నన్నిస్తోంది. తక్కువపదాలలో ఎక్కువ అర్థాన్ని అందించడం కవి వివేకంగా చెప్పి ద్విపద పై గల అపూర్వ ఆదరాభిమానాన్ని ప్రకటిస్తాడు. అందుకే శ్రీ బండారు తమ్మయ్య గారు 'ద్విపదలో సోమన్న ప్రకటించిన నవీన గుణ ములు అసంఖ్యాకములు, అనిర్వచనీయములు' (పీఠిక-పుట 86) అంటారు. సోమన్న తనది 'జాను తెనుగు'అని చెప్పుకోవడం జరిగింది. దీనిని మొదటిగ నన్నెచోడ కవిరాజు పేర్కొనడం జరి గింది. "కన్నడ కవులు 'జాణ్ణుడి' యని చమత్కా రార్థమున వాడిరి' అని శ్రీ యస్. రామకృష్ణశాస్త్రి గారు అంటారు (ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వ స్వము పుట 325). కనుక సోమన్న కూడా చమ త్కారార్థజనితమైన తేటతెనుగును జాను తెనుగుగ చెప్పి యుండవచ్చును.

సోమన్న ద్విపద శైలి విభిన్నంగా కన్పి స్తోంది. ఎన్నిరకాలలో నడిపించాలో ద్విపదను సోమన్న అన్నిరకాలుగ నడిపించాడు. ఒకప్పుడు అలతి అలతి పదాలతో ఎక్కడికక్కడ విడిపోతూ నడుస్తుంది. మరొకప్పుడు సంస్కృత సమాస సంఘటితమై హిమవత్ శిఖరం నుండి దూకుచున్న గంగా ప్రవాహంలా ధారాళంగా పరుగిడుతుంది. ఇంకొకప్పుడు మంద్ర గంభీరంగా సాగుతుంది. ఏ నడకలోనడచినా పాఠకుల హృదయాలనుమాత్రం కదల్చుతుంది. నవరస భరితం చేస్తుంది.

చన్నిచ్చి పలుమాఱు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
యాఁకొనఁగాఁ గడుపరసి పాలిచ్చి
సాకించి పెనుపదే జనని కల్గినను
దానింత వాఁడయ్యెఁ దల్లి లేకయును
దానెంత వెరుగునో తల్లి గల్గినను?
(బ.పు. ఆ. 3—865)

ఇత్యాదిగ అచ్చికమైన పదాల అమరికతో అమితానందంగా సాగుతుంది. మఱియు

సర్వాంగలింగి సంసార నిస్సంగి
గర్వాపహారి ప్రాక్తన శివాచారి
సారగుణాన్వేషి సరస సంభాషి
కారుణ్యరాశి లింగమనః ప్రవేశి
(బ.పు. ఆ. 2-398)

మొదలుగ తత్సమ పదాల పొందికతో, అంత్యానుప్రాస నలంకరించుకొని ముగ్ధ మోహనం గానూ సాగుతుంది. వేఱొకప్పుడు.

మల హరాత్మకమగు మంత్రంబుఁగఱచి
పలు మంత్రములు గొన పాపంబుగాదె
శూలి భక్తుల కెత్తుకేలది త్రాటి
మాలల కెత్తుట మఱి తప్పుగాదె?

కర్మ పాశంబు లొక్కటఁ దెగసిల్గి
కర్మంబు త్రాళ్ళు దాఁగట్టుకోఁదగునే ?

(బ. పు. ఆ. 1-870)

ఈ విధంగా గంభీరంగాను సాగుతుంది. ఎక్కడా అర్థ క్లిష్టత, అన్వయ కాఠిన్యంగానీ వుండవు. సుపరిచితమైన పదాలనే ప్రయోగించాలని సోమన్న తాపత్రయ పడలేదు. అందుకు ఆయన వ్యాకరణాన్ని కూడ సరకు చేయడు. తన సాహిత్యం సర్వులకు అర్థం కావాలి అదే ఆయన ఆశయం.

బసవ పురాణంలో ఎందరో ఎందరెందరో శివభక్తుల చరిత్రలున్నాయి. జ్ఞానులు, అర్థజ్ఞానులు, జ్ఞానమేలేనివారు, మూఢులు, మూర్ఖులూ వున్నారు. సృష్టి స్థితి కర్తలైన బ్రహ్మ విష్ణువులూ వున్నారు. భక్తవత్సలుడైన పరమేశుని బిడ్డగా ఆదరించిన వారు, పెద్దగా గౌరవించిన వారు, ప్రియునిగా సేవించిన వారు, సేవకునిగ ఊడిగంచేయించు కున్న వారూ వున్నారు. పత్రాలతో పూజించిన వారు, పువ్వులతో అలంకరించిన వారు, ముగ్గులతో మురిపించినవారు, పంచ భక్ష్య పరమాన్నాలతో పరవసింపచేసిన వారు, భూతితోనే పరితృప్తి నందించినవారూ వున్నారు. ఆ లింగ రూపుని బ్రతిమిలాడి పాలు త్రాగించిన వారు, కన్నబిడ్డనే కోసి, వండి, వడ్డించిన వారూ వున్నారు. అడవి పంది మాంసపు కరకుట్లు, శశకమాంసపు ఓగిర ముల రుచులను చూపినవారూ వున్నారు. స్వామి విషమ నేత్రుడైనను సమదృష్టి కలవాడు. అందరినీ సమాదరించి, సాయుజ్యాన్నివ్వడం జరిగింది. ఇది సోమన్న ప్రధానాశయం. సాహిత్యంలో సహజాద్భుతత్వాన్ని సుస్పష్టంగా ప్రదర్శించినకవి సోమన్న అనడం అత్యుక్తికాదు.

భక్తుల కథల చిత్రీకరణమున సోమన్న భక్త్యావేశంలో పాత్రతో తాదాత్మ్యాన్ని పొందుతాడు. బెజ్జ మహాదేవి యనే భక్తురాలు-పోషణలేని భర్తని చూచి అమాయకత్వంతో తీవ్ర బాధకు గురవుతుంది. 'లోకంలో తల్లిలేని వారు లేరు. కాని శివునకు తల్లియేది ? తల్లిలేదనుకే తలజడలు కట్టుకొంది. జింక చర్మంతో ఒళ్ళు దాచుకుంటున్నాడు. బూడిద పూత, పాములసొగలు, వల్లకాటి యిల్లు. తల్లియున్న ఇలా వుండ వచ్చేదా? తల్లి ఆలనా పాలనా లేక శివుడు యిలా వికారియైనాడు. కనుక ఈ లింగ రూపునకు నేనే తల్లినై సాకుకుంటాను' అని సాకడం మొదలెడుతుంది. ఆ తల్లిని పరీక్షింప హరుడు ఒకనాడు పాలు త్రాగడు. రోగిష్టిగా వుండి పోతాడు. అప్పుడాతల్లి

నా కన్న! నా పట్టి! నా చిన్నపడుచ!
నా కడుపు చన్నేలరా కుర్వవైతి?
నీ చెనుట యుఁజూచి నెత్తురుడు పుడు
నో చెల్ల! యెటు సూడ నోపుదునన్న!
తల్లిఁ గదన్న! యింతటి కోర్తునన్న!
నేలపై నా కాళ్ళు నిలువవుర న్న

..........................

చాలఁ జూడంగ నీ సంకటంబింక
కన్న మోహంబున దంబె నగ్గలము
ఎన్నఁ బెంచి ! మోహమెందు పెటంద్రుడు ::

(బ.పు. ఆ. 1-720-793)

ఇత్యాదిగ విలపిలలాడి పోతుంది. ఇట బెజ్జ మహాదేవికంటే ముందు సోమన్న కవి బాధే మనకు సాక్షాత్కరిస్తుంది. దేశీయ పదాలు అర్థస్ఫూర్తి నిస్తున్నాయి కాళ్ళు నిలవడంలేదట కన్న ప్రేమ కన్నా పెంచిన ప్రేమ అధికమంటూ వత్తాసు పల్కుతాడు." ఇది సోమన్న కవితా శిల్పం.

సోమన్న వర్ణనలు ప్రబంధాలకు మార్గదర్శకం అయినాయి. కాని సోమన్నలో ఆర్భాటం, ఆడంబరం, ప్రౌఢత్వం కన్పించవు, స్వభావ సిద్ధంగా వుండి కథలో కలిసిపోతాయి

'బసవని భక్తి ప్రభా పటలంబు
దెసల వసుంధర దివి దీటుకొనగ
దినకరుడాత్మీయ తేజంబు దఱుగు
డును మదిఁ లజ్జించి చని యపరాబ్ధి
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకె'

(బ.పు. ఆ. 3-181-186)

అని సూర్యాస్తమయం వర్ణన గావిస్తాడు. ఉత్ప్రేక్షాలంకార సహితమైన వర్ణన.
బసవని భక్తికాంతులు దశ దిశాంతములు వ్యాపించగా చూచి సిగ్గుపడిన సూర్యుడు ముఖం చాటు చేసుకున్నాడ న్నట్లు అస్తమించాడని చెప్పడం జరిగింది. కథ సాగుతోంది. కథతోపాటు వర్ణనయూ సాగింది. ఇది వర్ణన అని ప్రత్యేకంగాలేదు. ఊహా ప్రపంచాన్ని దించలేదు. నేల విడిచి సాము చేయలేదు. సహజత్వం ఉట్టిపడే విధంగా, కథకు బలము, ఔచిత్యమూ కల్గే విధంగా కూర్చడం జరిగింది.

సోమన్న కవితలో సహజత్వానికి తోడు లోకజ్ఞాన దార్ఢ్యత మెండు. మాదాంబ బసవన్నను నీళ్ళోసుకొంది. అపుడు సోమన్న చెప్పిన గర్భ చిహ్నములు ఆయన అతిలోక లౌకిక జ్ఞాన సంపదకు ఉదాహరణగా పేర్కొనవచ్చును.

అమృతాంశుడను పుత్రు డతిప గర్భమున
నమరియుండు నొక్కొ యాకలిగాదు
జల జాక్షి పదుపుస సద్భక్తి రుచిరిరుఁ
డలరుటనో రుచు లరుచులై తోఁచె....

(బ.పు. ఆ. 1-650-660)

ఇత్యాదిగా ఆకలి లేకుండు, రుచులు అరుచులు కావడం, తనువు తెలుపారడం, ఓ కిళ్ళు (వేవిళ్ళు) పుట్టడం, ఆవులింతలు రావడం, నిద్ర ఎక్కువ కావడం, చన్మొనలు నలుపెక్కడం, నడకలు తడబడడం, గర్భము నినుపారి (నున్నగా) తనుపారి (పరిపూర్ణముగ) పెనుపారి (గొప్పగ) వుంటుందట. లోక పరిశీలన ఎంతగ లేకపోతే ఈ కవి యింతగా గర్భ చిహ్నములు చెప్పి యుంటాడో ఆలోచించాలి.

సోమన్న సామాజికమైన సమానత్వాన్ని కోరినవాడు. కులాన్ని ఆయన ఒప్పుకొనలేదు.

'మొన్నఁ బుట్టిన కులమ్ముల మాటలేల
ధర 'నుమా మాతాపితా రుద్ర' యనగ
నరినొక్క తల్లి ప్రజలకు వేఱేది' యని,
ఒకుల స్థుడై యున్న యుభవుని భక్తు
నికి నేకులంబని నిర్ణయించెదవు'

(బ.పు. ఆ. 1-885)

అని కులాన్ని కూకటి వ్రేళ్ళతో పెకలిస్తాడు. భగవంతుని సృష్టిలోని మానవకోటి కులం మానవ కులం ఒక్కటే అని చాటుతాడు.

సోమన్న సకలస్మృతి పురాణ శాస్త్రపాండిత్యం మిక్కుటంగా కలవాడు. శైవ సంప్రదాయాన్ని, శైవమతధర్మాల్ని శ్రుతి స్మృతి వాక్యాల కన్వయించి ప్రామాణ్యాన్ని సంతరిస్తాడు. కవిదేవయ్యగారి కథలో 'రోకటి పాటలట్ల వేదములు-పనుగొనమా శివభక్తుల యిండ్ల—సారమేయములకు ధారుణి' (బ.పు. ఆ.7-220) లని చెప్పి, వేద పితామహుడనే పేరున్న శునకములను పిల్లి వేద పనసలను చెప్పిస్తాడు. శునకములైనా వానిలో వేదోపస్థితుడైన సర్వేశ్వరుడున్నాడడని ఋజువు చేసాడు. ముఖ్యంగాని జపతపముల

పేరిటతో ఆర్భాటం ప్రదర్శించడం ముఖ్యం కాదంటాడు. బసవపురాణంలో ఈయన వాడిన శ్రుతి స్మృతి వాక్యము లెన్నో ఎన్నెన్నో.

ఈ విధంగా పాల్కురికి సోమన్న వీర శైవ మత ప్రచారానికి సాహిత్యాన్ని సాధనంగా స్వీకరించినా, చాలవరకు విశ్వశ్రేయస్సును సాధించాడు. ముఖ్యంగా నాడు సమాజంలో పేరుకొని పోయిన నిర్వీర్యతను, నిస్తబ్ధతలను పారద్రోలి వీర శైవ మత బోధనలతో వీరత్వాన్నీ, సాహసాన్ని, స్థైర్యాన్నీ సమాజానికి అందించాడు. కావ్యప్రయోజనమైన సామాజిక చైతన్యానికి తోడ్పడ్డాడు. ఒక్కమతం-ఒక్కదైవం-ఒక్క ధర్మం అనే విధంగా సామాజిక సమైక్యతకు తనవంతు కృషి సల్పాడు. ఆకాశదారులంటా పోతున్న సాహిత్యాన్ని సామాన్యుల ముంగిటికి తెచ్చాడు. దేశీయ భాషకు-దేశీయ కవితకు గౌరవ మర్యాదల్ని సమకూర్చాడు. తన అభిప్రాయాలకూ, తన ఆలోచనలకూ, ఆశయాలకూ అనుగుణంగా సారస్వతాన్ని మలచుకొని, సమాజాన్ని మెప్పించి, ఒప్పించి విలక్షణమైన కవిగా ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఘన యశస్సు నార్జించిన పాల్కురికి సోమన్న ధన్యుడు

లెక్చరర్
ప్రభుత్వ జూనియర్ కళాశాల
నందికొట్కూరు, కర్నూలు జిల్లా

# పుస్తక సమీక్ష

## అగ్నివీణ ఆలాపించిన అణు సంగీతం

అభ్యుదయ కవిపరంపరలో ప్రముఖ స్థానం పొందిన అనిసెట్టి సుబ్బారావు కవితను సమగ్రంగా పరిశీలించే గ్రంథమిది. రచయితగా అభ్యుదయ కవులలో ప్రముఖ స్థానం సంపాదించినవాడు శ్రీ అవంత్స సోమసుందర్. శ్రీ సోమసుందర్ ప్రఖ్యాత కవే కాక గొప్ప విమర్శకులుగాప్రసిద్ధి వహించారు. వీరు 'కళాకేళి' పత్రికా సంపాదకులుగా కూడ తెలుగు సాహితీ జగత్తుపై కొత్త వెలుగు ప్రసరింపజేశారు. కృష్ణశాస్త్రి కవితనూ, శ్రీరంగం నారాయణబాబు కవితనూ చక్కగా అనుశీలించి గ్రంథరూపంలో వెలయించి ఉత్తమ విమర్శకులుగా ప్రవన్నె కెక్కారు. పై రెండు గ్రంథాలను సాహితీ లోకం ఆదరించి, ప్రశంసించింది.

అనిసెట్టి సుబ్బారావు అభ్యుదయ కవితా గీతాలను సంపుటీకరించి 'అగ్నివీణ'గా 1949లో ప్రచురించారు. తరువాత సినిమా లోకంలో ప్రవేశించి, సినీ కవిగానే స్థిరపడినాడు. ఈ కారణంగా అనిసెట్టి అభ్యుదయ కవిగా ఆంధ్ర జనుల విస్మృతి పథంలోకి జారిపోయాడు. ఆయన 'అగ్నివీణ' ఆధునిక సాహితీ పరులకు చాలామందికి స్మృతి పథంలోకి రాకుండా పోయింది. ఇది చాలా బాధా కర విషయం.

ప్రస్తుత గ్రంథంలో శ్రీ సోమసుందర్ అనిసెట్టి కవిత్వాన్ని సమగ్రంగా పరిశోధించి, పరిశీలించి, విశ్లేషించి, వివేచించి అనిసెట్టి కవితా స్వరూపాన్ని మన ముందు ప్రత్యక్షం చేశారు. అనిసెట్టి అగ్నివీణను మీటి అణు సంగీతం ఆలపించారు.

'(19)40లో గొంతు విప్పిన ప్రతి కవీ శ్రీ శ్రీ గీచిన గిరులనుంచి తప్పించుకోలేక కొట్టుమిట్టాడుతున్న సమయంలో శక్తివంతమైన కవితా ధారగా 'నయాగరా' ప్రభవించింది. మార్పులేని లేని కృతక స్వరూపాన్ని చూసి విసిగి కినిసి కవిత్వంలో కారుణ్యవాదానికి యథోచిత స్థానాన్నొసగి శ్రీశ్రీప్రభావం నుంచి తప్పుకొని. నూత్న సంగీతాన్ని ఆలపించిన వారిలో శ్రీ అనిసెట్టి

ఈ వాక్యాలు శ్రీ సోమసుందర్ 1949లో 'అగ్నివీణ' గ్రంథం ఆవిర్భవించిన సందర్భంలో 'ఆనందవాణి'లో ప్రచురించిన 'అగ్నివీణ' సంగీతం విని అనే వ్యాసంలోనివి. ఈ వాక్యాలు అనిసెట్టి కవితా స్వరూపాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

శ్రీ సోమ సుందర్ ఇంచుమించుగా 'అగ్నివీణ'లోని ప్రతి కవితనూ స్పృశించి చక్కగా విశ్లేషించి అనిసెట్టి ఆశయాన్నీ, అభిప్రాయాలనూ మన ముందుంచారు. ముఖ్యంగా అగ్నివీణి గీతావళిని

కరుణారసప్లావితాలని నిర్దిష్టంగా నిరూపించారు. ఇందుకు రెండు మూడు ఉదాహరణలు.

'బిచ్చగాళ్ళను, పిచ్చివాళ్ళను, తలిదండ్రుల నెరుగని పిల్లలను కరుణామయ హృదయంతో తిలకించ నారంభించాడు ఆసిసెట్టి' అంటూ ఈ క్రింది గీతభాగాన్ని ఉదహరించడం జరిగింది. తల్లి 'కడుపు చల్లగ కలిగిన నాకై కడలి గుండె పొంగిందని, భూమి తనువు పూచిందని, ధవళ హిమాచల శృంగము తల ఎత్తిందని రీవిగా జోల పాట విన్నాను, కళ్ళు విప్పి నవ్వాను'. ఈ గీతాన్ని సోమసుందర్ చాలా చక్కగా వ్యాఖ్యానించారు.

మరొక ఉదాహరణ.

'వచ్చాను వచ్చాను వ్యాస సంతతివాణ్ణి
వెళ్ళిపోయిన కోటి కోట్ల జీవుల విడిచి
మళ్ళిపోయే నేటి కోట్ల జీవుల కొరకు
పొర్లి వచ్చే కోటి కోట్ల జీవుల కొరకు'

ఈ గీతాన్ని శ్రీ సోమ సుందర్ విశ్లేషించి ఈలా వ్యాఖ్యానించారు. భారతదేశంలో పుట్టిన ఏ కవియైనా అనూనమైన సంప్రదాయం నుంచి పుట్టినవాడే. నిన్నటి సంప్రదాయం నేటికి గతమై నేడు రేపుగా పరివర్తితమౌతూ ఉంటుంది. మన దేశ కవితా సంప్రదాయానికి వ్యాస, వాల్మీకులు మూల పురుషులు. ఆనాటి వ్యాసుడు ఒకానొక సమాజ పరిణామ దశలో నూత్న ధర్మప్రతిష్ఠాపన కోసం అవిర్భవించిన కారణజన్ముడు. అట్టి మహనీయుని సంతతివాణ్ణని ఈ కవి ఆత్మజ్ఞానాన్ని ప్రదర్శించుకుంటున్నాడు. అయితే వ్యాసుని సంప్రదాయం అంటే వ్యాసుని పట్ల అంధ విశ్వాసం ప్రకటించుకోవడంగా మనపండితులు దురవగాహన పాల్పడ్డారు. మన జాతిని అతను నెలకొల్పిన సంప్రదాయంలోని మౌలిక పదార్థాన్ని విడిచిపెట్టారు. కనుకనే ఈ కవి విగత జీవులైన కోటి కోట్లని, వారి ఆలోచనా పథాన్ని విడిచి, మళ్ళిపోయే నేటి కోటి కోట్ల జీవుల కొరకు, వాళ్ళకు పునరుజ్జీవనం కలిగించడం కొరకు తాను వ్యాస సంతతివాణ్ణిగా వచ్చాడు'.

అలాగే ఈ దిగువ గీతాన్ని శ్రీ సోమసుందర్ విశ్లేషించిన తీరు గమనింపదగినది.

'పగలు పగిలిన గాజు పేటిక
మంత్రగత్తె కాలం గుప్పిట'

అని ప్రారంభించిన ఈ కవిత అతిలోకమైన భావనకు అద్దం పట్టినట్లు కనిపిస్తుంది. కాలం మంత్రగత్తె వంటిది. దాని గుప్పెటలో ఒక గాజు పెట్టె ఉంది. అది తళతళా మెరుస్తుంది. లోపలున్న వాటిని కనపరుస్తుంది. కాని అది పగిలిపోయింది. అదే ప్రస్తుతం పగలువలె కనిపిస్తోంది. దానికి వేయి ముఖాలు. వేయి రూపాలు. ఈ పగలడం ఆశాభంగానికి చిహ్నం. ఆకాశం చూపుల్ని ప్రసరిస్తుంది. అవే హస్తరేఖలు. వాటిని బట్టి కాలం హస్తసాముద్రికాన్ని చెప్పి వెయ్యవచ్చు'

ఈ విధంగా శ్రీసోమసుందర్ అగ్నివీణలోని అనేక కవితలను ఉదాత్తరీతిలో విశ్లేషించి వ్యాఖ్యానించారు. ఈ వాఖ్యలు విమర్శకుని ప్రతిభా పాటవాన్ని వెల్లడిస్తున్నాయి.

'అగ్నివీణ'లో చేర్చబడని, 'కల్పన' అనే అభ్యుదయ కవుల కవితా సంకలనంలో ప్రచురితమైన 'అణు సంగీతం' అనే దీర్ఘ కవితను ప్రస్తుత

---

రచన: ఆవంత్స సోమసుందర్
ప్రచురణ: కళాకేళి ప్రచురణలు,
పిఠాపురం-533450.
వెల : రూ. 20-00.

గ్రంథంలో ప్రకటించి తెలుగు సాహితీ లోకానికి ఎంతో మేలు చేసిన శ్రీ సోమసుందర్ మిక్కిలి అభినందనీయులు.

1945లో అమెరికా సామ్రాజ్య వాదులు జపాన్‌లోని హిరోషిమా, నాగసాకి నగరాలపై అణు బాంబులు పేల్చారు. దాని వల్ల లక్షలాది జనం దారుణహత్యకు గురైయ్యారు. ఈ విషాద సంఘటనకు విహ్వాలించిన అనిసెట్టి కరుణరస భరితమైన 'అణు సంగీతం' అనే దీర్ఘ కవిత రచించాడు. ఈ కవితపై శ్రీ సోమసుందర్ గొప్ప వ్యాఖ్య వ్రాశారు.

'అగ్నివీణ'లో చోటు చేసుకోని మరొక ఉత్తమ దీర్ఘ కవిత 'నవ భారతి'.ఇది కాశ్మీర జీవన జాగృతికి రసావేశ ప్రతిబింబం. ఈ కవిత యొక్క ప్రారంభ పంక్తులు ఈలా ఉన్నాయి.

'ప్రకృతి నిత్యవసంతాన పరవమౌ నృత్యశాల
పురుష దనంతు దజేయుడు విశ్రమించు పాంథశాల
స్మిత భారత వదనం కాశ్మీర సీమ గత చరితం'

ఈ ఉత్తమ కవిత అనిసెట్టి భావనాకాశంలో ప్రభవించిన అందమైన ఇంద్రధనుస్సు.

ఈ కవితపై కూడా శ్రీ సోమసుందర్ చక్కని వ్యాఖ్య వ్రాశారు.

ఇంకా శ్రీ సోమసుందర్ అనిసెట్టి వ్రాసిన 'పృథ్వీగీతం' మొదలైన కవితలను గూర్చి విమర్శ వెలయించి, ఉత్తమ విమర్శనా పథంలో పయనించారు. ఈ గ్రంథం ఒక మంచి విమర్శన మన ముందుంచుతున్నది.

— వేముగంటి నరసింహాచార్యులు

# వార్తావాహిని

## కబీరు సుభాషితాలు గ్రంథావిష్కరణ, సుప్రసిద్ధ హిందీప్రచారకులకుసన్మానం

తేది 3-11-91 విశాఖపట్టణం, ఆంధ్ర విశ్వ విద్యాలయము నందు డా॥ అంబేద్కర్ అసెంబ్లీ హాలులో హిందీ ప్రచార మహాసభలు నిర్వహించ బడినవి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర), హైదరాబాదు అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు సభకు అధ్యక్షత వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపకులపతి డా॥ యమ్. గోపాలకృష్ణారెడ్డిగారు జ్యోతిని వెలిగించి సభను ప్రారంభం చేశారు. ఆ సందర్భములో ప్రముఖ హిందీ-తెలుగు రచయిత శ్రీ ఈమని దయానంద గారి 'కబీరు సుభాషితాలు' అనే గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ ఈనాడు దేశంలో ప్రబలుతున్న కుల తత్వం, మతమౌఢ్యం, సమాజ ప్రగతికెంతో అవరోధంగా ఉన్నాయని, ఈ స్థితిలో కబీరు వంటి సాంఘిక సంస్కర్త యొక్క రచనలు బహుళ ప్రచారం పొందడము అవసరమని వివరించారు. కబీరు భావాలను తెలుగు ప్రజానీకానికి అందించ డానికి దయానంద గారు చేసిన కృషి ప్రశంస నీయమని తెలిపారు. శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు, శ్రీ తుంబలి శ్రీనివాసరావు, మేనేజింగ్ డైరెక్టరు, తుంబలి ట్యూబు ఇండస్ట్రీస్, విశాఖ పట్టణం, దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. రామస్వామి, ఆంధ్ర ప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజా వెంకటేశ్వరరావు గారు దయానందగారి కావ్యవిశేషాలను వివరిస్తూ ప్రసంగించారు. కబీరు సుభాషితాలు అనువాద గ్రంథమైనా, అది మౌలిక రచనగా తెలుగు నుడికారముతో భాసిల్లుతున్నదని ప్రశంసించారు.

ఆదర్శ హిందీ మహా విద్యాలయము ప్రిన్సిపాల్ శ్రీమతి ఎమ్. సీతాలక్ష్మి ప్రస్తుతం హిందీ ప్రచారకులు ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలను వివరిస్తూ అందరి తరపున ఒక మెమొరాండమును మరియు ఆదర్శ హిందీ టైపు విద్యాలయము ప్రిన్సిపాల్ శ్రీ యం. వి. తిరువెంగళాచారి హిందీ టైపు మరియు షార్టుహ్యాండు పరీక్షలలో విద్యార్థులు ఎదుర్కొంటున్న కొన్ని టెక్నికల్ ఇబ్బందులను వివరిస్తూ ఒక మెమొరాండమును ప్రధాన కార్యదర్శి దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు, శ్రీ ఎ. రామస్వామి గారికి అందజేసిరి.

ప్రచారకుల తరపునుండి దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు మరియు హైదరాబాదు సభ కార్యవర్గ సభ్యులు, అధికారులు ప్రయత్నము చేసి 1992వ సంవత్సరమునకు ఎలాగైనా

ఆంధ్రప్రదేశ్‌లో హిందీ ప్రచారక ట్రైనింగు విద్యాలయములను ఏర్పాటు చేయవలసినదిగా కోరిరి.

తదనంతరం శ్రీ దత్తి చిన్నిక్రిష్ణ, రిటైర్డ్ అసిస్టెంటు రేడియో ఇంజనీరు గారు తమ కావ్యగానము చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయము హిందీ విభాగము రీడరు శ్రీమతి డా॥ కె. సీతాలక్ష్మిగారు స్వాగత వచనాలు పలికారు.

ఆనాడు సాయంత్రం జరిగిన సన్మాన సభకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. రామస్వామి గారు అధ్యక్షత వహించారు. ఆంధ్రదేశము నలుమూలల నుండి ఆహ్వానితులైన సుప్రసిద్ధ హిందీ భాషాభిమానులకు, పండితులకు సన్మానములు నిర్వహించబడ్డాయి.

సర్వశ్రీ ప్రొఫెసర్ జి. సుందరరెడ్డి, ఆంధ్ర విశ్వవిద్యాలయము, (హిందీ విభాగం)ఎ. రామస్వామి, కనకదుర్గ, భోయపాటి నాగేశ్వరరావు: తుఃబలి శ్రీనివాసరావు, కాజ వెంకటేశ్వరరావు, చవాకుల నరసింహమూర్తి, ఈమని దయానంద, అనంతలక్ష్మి (ఒంగోలు), పి. మహేశ్వరరావు, సీత (కాకినాడ), బి. అంజయ్య, వనజాక్షి, సి. హెచ్. కుసుమహరనాథ శర్మ, లలిత గార్లను ప్రముఖ వ్యాపారవేత్త మరియు రాజ్యలక్ష్మి ఫౌండేషన్ (మద్రాసు) సంస్థాపకులు శ్రీ రమణయ్య రాజా గారు ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో ప్రత్యేకాహ్వానితులైన శ్రీ డా॥ ఆవద రావు (రీడరు, తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయము) గారు సన్మానితులకు జ్ఞాపికలు బహుకరించారు.

ఆదర్శ హిందీ మహా విద్యాలయము వ్యవస్థాపకులు శ్రీమతి ఎం. వేదవల్లి మరియు శ్రీ ఎం. శేషాచారి గార్లకు విశిష్ట సన్మానం జరిగింది. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు మరియు ఆంధ్ర సభ హైదరాబాదు వారును, విశాఖ జిల్లా హిందీ ప్రచారకులు, స్థానిక ప్రముఖులు, విద్యార్థినీ విద్యార్థులు వారి సేవలను కొనియాడుతూ తమ ఆదరాభిమానాలను ప్రదర్శించారు. పూలమాలలతోనూ. శాలువలతోనూ ముంచెత్తారు. వివిధ సాంస్కృతిక కార్యక్రమములు జరిగాయి. విశాఖ స్టీల్ కల్చరల్ అసోసియేషన్ వారు తమ సంగీత సౌరభాలతో సభను రంజింపజేసిరి.

శ్రీమతి ఎం. వేదవల్లి గారి వందనసమర్పణలతో సభ జయప్రదంగా ముగిసింది.

## హిందీ ప్రేమీ మండలి- గుంతకల్లు సన్మాన సభ

తేది 22-8-1991 న సాయంత్రం 3-30 గంటలకు శ్రీ ఎ. రామస్వామి గారు, జనరల్ సెక్రటరీ దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు, పదవీ బాధ్యతలు స్వీకరించిన సందర్భమును పురస్కరించుకొని హిందీ ప్రేమీమండలి గుంతకల్లు తరపున సన్మాన సభ జరిగినది. ఈ సన్మాన సభకు జిల్లాలోని హిందీ ప్రచారకులు, పండితులు, స్థానికంగా ఉన్న హిందీ పండితులు, హిందీ భాషాభిమానులు విచ్చేసిరి.

తేది 22-8-1991న ఉదయం 10-30 గం॥ల నుంచి 1 గంట వరకు శ్రీ ఎ. రామస్వామి గారి అధ్యక్షతన జిల్లాలో హిందీ ప్రచారకుల సంగోష్ఠి జరిగినది. ఈ సంగోష్ఠిలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాదు కార్యదర్శి శ్రీ పి. ప్రసాదరావు గారు, కోశాధికారి శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు,దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు శిక్షా పరిషత్తు మెంబరు అయిన

శ్రీ టి. హనుమంతరెడ్డి గారు పాల్గొనిరి. పలు తీర్మానములు చేయబడినవి.

సాయంత్రం 3-30 గంటలకు సన్మానసభ ప్రారంభమైనది. హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ వంకదారు రామకృష్ణయ్య గారు ముఖ్య అతిథులకు స్వాగతము చెప్పుచూ అతిథులనుసభావేదిక పైకిఆహ్వానించిరి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర, హైదరాబాదు నిధి పాలక మండలి అధ్యక్షులగు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ గారు అధ్యక్షత వహించిరి. గౌరవ అతిథి శ్రీ ఎన్. రామమోహన రావు, మునిసిపల్ కమీషనరు గారు సన్మానకర్తగా సభావేదిక నలంకరించిరి. సన్మానిత అతిథి శ్రీ ఎ. రామస్వామి గారు వేదికపై ఆసీనులైరి. అభినందన ఉపన్యాసకులుగా శ్రీ పి. ప్రసాదరావు గారు, శ్రీ కె. ప్రహ్లాద గుప్తగారు, ఉపాధ్యక్షులు ద.భా. హిందీ ప్రచార సభ, శ్రీ చవాకుల నరసింహమూర్తి గారు కోశాధికారి ద.భా. హిందీ ప్రచారసభ, ఆంధ్ర సన్మాన సభలో పాల్గొనిరి.

మండలి అధ్యక్షులు శ్రీ వంకదారు రామ కృష్ణయ్య గారు హిందీ భాషాభివృద్ధికి, ప్రచారము నకై ఎక్కువగా పాటుపడిన శ్రీ ఎ. రామస్వామి గారిని సన్మానించుట ఒక భాషాభిమాని కర్తవ్యముగా నేను భావించుచున్నాను. అటులనే హిందీ ప్రచారమునకు కావలసిన అనుకూల పరిస్థితులను కల్పించవలసినదిగా భగవంతుని ప్రార్థించుచున్నానని చెప్పిరి.

అధ్యక్షులు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ గారు మాట్లాడుతూ అన్ని యూనివర్శిటీల వలె మద్రాసులో కూడ హిందీ మీడియం యూనివర్శిటి, ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ ప్రారంభించబడినది. మద్రాసుతో పాటు దక్షిణ భారతదేశము లోని నాల్గు ప్రాంతములలో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులు ప్రారంభించినాము. సాహిత్య సంబంధమైన విషయములలో నిష్ణాతులైనప్పటికిని, ప్రాయోగిక భాషాపరమైన హిందీలో అనుభవము లోప భూయిష్టముగా ఉన్నది. ఈ లోటును తొలగించుటకు ప్రాయోగిక భాషకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూ, పాఠ్యక్రమాన్ని క్రమబద్ధము చేయాలని తలంపుతో బి.ఇడి., యం.ఇ.డి, హిందీలో కంప్యూటర్ కోర్సులు సభ తరపున నడుపబడుచున్నవి. దక్షిణ భారతదేశములో ఏకీకృతముగా హిందీ ప్రచారము విస్తరింప చేయవలసిన పని ఎంతైనా అవసరము. హిందీ భాష సర్వాంగీణ వికాసానికి, సర్వతోముఖ వికాసమునకు ఉత్తర ప్రదేశ్‌లో కంటె దక్షిణ ప్రాంతములోనే ఎక్కువ అవకాశమున్నదని చెప్పిరి. రాయలసీమలో బి.ఇడి. కాలేజిని నిర్వహించవలసిన అవసరమున్నది. దానికి గాను స్థలము కేటాయించ వలసినదిగా మున్సిపల్ కమీషనర్ గారికి, పట్టణ ప్రజలకు విజ్ఞప్తిచేసిరి. సభవారు నిర్వహించు హిందీ బి.ఇడి. పాసైనవారు కేంద్రీయ విద్యాలయములోను, నవోదయ స్కూళ్ళల్లోను నియమింప బడుచున్నారు. కనుక మన సభవారి బి.ఇ.డి.పరీక్షలకు ఎక్కువ ప్రాముఖ్యత ఉన్నదని నుడివిరి.

గౌరవ అతిథిగాను, సన్మానకర్తగా వచ్చిన శ్రీ ఎన్. రామమోహనరావుగారు, మునిసిపల్ కమీషనర్, శ్రీ ఎ. రామస్వామిగారికి పూలమాలవేసి శాలువకప్పి నూతన వస్త్రములతో సన్మానించిరి. వారు ఉపన్యసించుచూ హిందీ భాషాభిమానిగా నేను ఈ సన్మానము చేయుటకు గర్వించుచున్నాను. శ్రీ ఎ. రామస్వామిగారు భవిష్యత్తులో గొప్ప ఉజ్వల

మైన వ్యక్తి అగుదురుగాకయని ఆశీర్వదించినారు. బి.ఇ.డి. కాలేజీకి స్థలము సేకరించు విషయంలో నేను సంపూర్ణ సహాయము చేస్తానని మాటయిచ్చిరి.

శ్రీ కొ. ప్రహ్లాద గుప్తగారు ఉపన్యసించుచూ శ్రీ ఎ. రామస్వామిగారి హిందీ సేవలను కొనియాడిరి.

శ్రీపి. ప్రసాదరావుగారు సెక్రటరీ ; ద.భా. హిందీ ప్రచారసభ-ఆంధ్ర, మాట్లాడుతూ గుంతకల్లులో హిందీ ప్రచారము బాగా జరుగుతున్నందుకు సంతోషముగా నున్నది అని నుడివిరి.

శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు మాట్లాడుతూ నేను ఈ పట్టణాన్ని కార్యాలయాన్ని చూసి చాలా సంతోషించినాను. ట్రస్టుబోర్డు అధ్యక్షులుగా శ్రీ ఆంజనేయశర్మగారు ఈ సభకు వచ్చినారు. శ్రీ వి. రామకృష్ణయ్యగారు పెద్దవారు. వారి పనితీరును ఉత్సాహమును చూచి, సంతోషించాను. ఒక ఎకరము స్థలము ఉంటే కాలేజి తయారవుతుంది. 'ఇంతింతై వటుడింతయై' మాదిరిగా యిప్పుడున్న చిన్న భవనము రేపు పెద్ద భవనముగా రూపొందించవచ్చు అన్నారు.

శ్రీ.కే.వి. సుబ్బారావుగారు హిందిలో అభినందన పత్రము చదివిరి. శ్రీవై. వేంకటస్వామిగారు తెలుగులో అభినందన పద్యరత్నములు చదివి వినిపించిరి. ప్రవీణ పాసైన విద్యార్థుల తరపున గుంతకల్లులో హిందీ ప్రశిక్షణ విద్యాలయము నడుపవలసినదిగా కోరుతూ విజ్ఞాన పత్రము సమర్పించబడెను.

సన్మానితులైన శ్రీ ఎ. రామస్వామిగారు సమాధానమిస్తూ ఈ విధంగా సన్మానము చేయించుకోవడం నాకు యిష్టములేదు. కాని. శ్రీ వి. రామకృష్ణయ్యగారికి, నాకు గల సంబంధమును బట్టి నేను ఒప్పుకొనవలసి వచ్చినది. గుంతకల్లులో స్వర్ణ జయంతి భవనమునకు 1937లో నేను పునాది వేసినాను. ఆ తర్వాత యిన్ని దినములకు నేను ఈ భవనమును చూచుటకు వచ్చినాను. ఈ భవనమును చూచి నాకు చాలా ఆనందము కలిగినది. హిందీ ప్రేమీ మండలివారు చేసిన ఈ పని చిరస్థాయిగా నిలిచిపోతుంది. గుంతకల్లులో హిందీ ప్రచారమునకు ఒక ఊపు వచ్చింది. ఉదయం జిల్లాలోని అనేక హిందీ పండితుల సంగోష్ఠిలో హిందీ పండితుల పరిచయము అయినది. వారి సమస్యలను అర్థము చేసుకొన్నాను. వారి సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించెద ననిరి. రాయలసీమ ప్రాంతానికి ప్రశిక్షణ విద్యాలయం ఎంతైనా అవసరముంది. కాబట్టి గుంతకల్లులో శాఖాకార్యాలయము ఉన్న కారణంగా ఇక్కడే ప్రశిక్షణ విద్యాలయం ఏర్పాటుచేస్తామని చెప్పిరి. నన్ను ఇంత ప్రేమతో సన్మానించిన హిందీ ప్రేమీ మండలి కార్యకారిణి సమితి సభ్యులకు ధన్యవాదములు తెల్పుచున్నాను.

తరువాత సన్మాన సభకు వచ్చిన శ్రీవేమూరి ఆంజనేయశర్మ, శ్రీ కే. ప్రహ్లాదగుప్త, శ్రీ పి. ప్రసాదరావు, శ్రీ చవాకుల నరసింహమూర్తిగార్లు దుశ్శాలువలతో సన్మానింపబడిరి.

శ్రీ కే. గంగిరెడ్డి కార్యదర్శి హిందీ ప్రేమీ మండలి అతిథులకు, హిందీ ప్రచారకులకు ధన్యవాదములు సమర్పించిరి. రాష్ట్రీయ గీతాలాపముతో సభ ముగిసినది.

## వాణీ హిందీ విద్యాలయము 12వ వార్షికోత్సవం

తే. 6-8-91 దిన స్థానిక వాణిజ్య భవన్ ఉల్లివీధి విజయనగరంలో వాణీ హిందీ విద్యాలయ



12వ వార్షికోత్సవం సాయంత్రం కడువై భవంగా జరిగింది. పై సభా కార్యక్రమంలో జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ టి. వి. ఎస్. శాస్త్రి ముఖ్య అతిథిగాను, నగర మున్సిపల్ కమీషనర్ శ్రీ వి. వెంకన్న సభ అధ్యక్షులుగా విచ్చేసి మాజీ భారత ప్రధాని దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షులు స్వర్గీయ శ్రీ రాజీవ్ గాంధీ చిత్ర పటాన్ని పూలమాలతో అలంకరించి, జ్యోతిని వెలిగించిరి. పిదప సభ ఒక నిముషము సేపు మౌనం పాటించి ఘన నివాళులు అర్పించింది.

ఉపాధ్యాయ శిరోమణి, జాతీయ స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత ఆర్.సి.టి. హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు శ్రీ యు. ఏ. నరసింహం గారిని ముఖ్య అతిథి శ్రీ టి. వి. ఎస్ శాస్త్రి గారికి శాలువా, పూలమాలతో ఘనంగా సన్మానించిరి.

అధ్యక్షులు నగర కమీషనర్ శ్రీ యు. వెంకన్న గారుమాట్లాడుతూ ఆనాటి ఉపాధ్యాయులలో శ్రీ వై. ఆంజనేయులను పోల్చి తను చేస్తున్న ఉద్యోగ ధర్మమును నిర్వహిస్తూ మిగిలిన సమయంలో ఇంత పెద్ద ఎత్తున హిందీ ప్రచారం చేయడం ఎంతైనా ప్రశంసనీయమని పేర్కొనిరి.

శ్రీ యు. ఏ. నరసింహంగారు తన ప్రసంగంలో తనకు జరిగిన ఈ సన్మానానికి కృతజ్ఞతలు తెలియ చేసుకుంటూ, జరిగిన సన్మానం నాకు కాదని అది ఉపాధ్యాయ వృత్తికే జరిగిందని సవినయంగా సభకు తెలియచేసిరి.

తదుపరి శ్రీ ఎమ్. ఎస్. కామేశ్వరరావుగారు అధ్యక్షులు, ఛాంబర్స్ ఆఫ్ కామర్స్, విజయనగరం మాట్లాడుతూ—హిందీ ప్రచారకులు ఈ ప్రాంతంలోనే కాక ఈ నగరంలో ఇతర ప్రాంతాల్లో కూడా హిందీ ప్రచారం చేస్తే బాగుంటుందని వివరిస్తూ తన వాటాగా ఏదైనా సహాయం చేయగలనని సభా ముఖంగా తెలియచేసిరి. ఎమ్. ఆర్. కాలేజి, తెలుగు లెక్చరర్, విజయనగరం, శ్రీరాయసూరి, శ్రీ వై. ఆంజనేయులు కూడా ప్రసంగించిరి. శ్రీ యు. ఆర్. నరసింహారావు గారు హిందీ పరీక్షల విజేతలకు బహుమతులు అందజేశారు.

# ఆంధ్రప్రదేశ్ హిందీ మహాసభలు

విజయవాడ

**1992 జనవరి 10,11 తేదీలలో**

## కా ర్య క్ర మ ము

ది 10-1-1992 శుక్రవారం ఉదయము గం. 9-30 లకు

పతాక వందనము : డా॥ జంధ్యాల శంకర్
మేయర్, విజయవాడ కార్పొరేషన్

సాయంత్రం గం. 2-30 లకు

### హిందీ మహాసభ ప్రారంభం

స్వాగత వచనములు : శ్రీముమ్మనేని సుబ్బారావు
B,Com.; F.C.A.
కోశాధ్యక్షులు, సిద్ధార్థ అకాడమీ ఆఫ్ జనరల్ అండ్ టెక్నికల్ ఎడ్యుకేషన్
అహ్వాన సంఘాధ్యక్షులు.

సభాధ్యక్షులు : పద్మభూషణ,
డా॥ మోటూరి సత్యనారాయణ
మాజీ రాజ్యసభ సభ్యులు

ప్రారంభకులు : గౌ॥శ్రీపాలడుగు వెంకట్రావు
పౌర సరఫరాల శాఖామాత్యులు

ఆంధ్రసభ నివేదిక : శ్రీ బోయపాటి నాగేశ్వరరావు
అధ్యక్షులు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాద్

ప్రత్యేక ఆహ్వానితులు :

శ్రీ యం యస్. రామచంద్రన్
మాజీ పార్లమెంటు సభ్యులు, ఉపాధ్యక్షులు
దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు

శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు
కృష్ణాజిల్లా పరిషత్ అధ్యక్షులు

గౌ॥ శ్రీ పేర్ని కృష్ణమూర్తి
సమాచార పౌర శాఖామాత్యులు

శ్రీ కావూరి సాంబశివరావు బి.యి.
మాజీ పార్లమెంటు సభ్యులు

శ్రీ చనుమోలు వెంకట్రావు
కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు,
మాజీ మంత్రి వర్యులు

శ్రీ రాయపాటి సాంబశివరావు
20 సూత్రాల పథకం చైర్మన్

శ్రీ చేకూరి కాశయ్య
ఖమ్మం జిల్లా పరిషత్ అధ్యక్షులు

శ్రీ వడ్డె శోభనాద్రీశ్వరరావు,
బి.ఎస్.సి;బియి. విజయవాడ పార్లమెంట్ సభ్యులు

కన్వీనరు : శ్రీ వెనిగళ్ళ వెంకటేశ్వరరావు
(అన్న) ఆహ్వాన సంఘ కార్యదర్శి

సాయంత్రం గం. 5–30 లకు

## హిందీ, తెలుగు కవి సమ్మేళనం

అధ్యక్షులు : శ్రీ గజ్జెల మల్లారెడ్డి
ప్రధాన సంపాదకులు, ఉదయం
హైదరాబాద్

ప్రారంభకులు : డా॥ యస్. సుబ్రహ్మణ్యం
'విష్ణు ప్రియ' కోశాధికారి. ద.భా. హిందీ
ప్రచారసభ, మద్రాసు

ప్రముఖ కవులు :

శ్రీ టి.వి. త్రిపాఠి, ఇన్‌కంటాక్స్
కమీషనర్, విజయవాడ

శ్రీ ఈమని దయానంద్
సంపాదకులు, స్రవంతి, హైదరాబాదు

డా॥ జయంత కాయర్‌కర్
ప్రిన్సిపాల్, హిందీ బి.ఇడి. కాలేజి,

శ్రీ ఉత్తమచంద్ గుప్త, యం.కాం.

శ్రీ వైడిపాటి సుబ్బరాయశాస్త్రి

శ్రీ టి. బి. యస్. గౌతమ్

డా॥ ప్రేమనారాయణ సింగ్

శ్రీ కాపూరి పూర్ణచంద్రరావు

డా॥ రేగులపాటి మాధవరావు

శ్రీ భీరూలాల్ సోలంకి

శ్రీ బొద్దులూరి నారాయణరావు

శ్రీ యడ్లపల్లి సీతారామయ్య

డా॥ బండ్లమూడి ఆంజనేయులు

శ్రీ యం. కళ్యాణరావు
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు, జోనల్ ఆఫీసు,
స్టేట్ బ్యాంక్

వందన సమర్పణ; శ్రీ చవాకుల నరసింహమూర్తి
కోశాధ్యక్షులు, ద.భా.హి.ప్ర.స. ఆంధ్ర,

రాత్రి గం॥ 8-00 లకు

## సాంస్కృతిక కార్యక్రమములు

1) మహాకవి శ్రీనాథుని ఆవేదన-నివేదన,
శ్రీ ఉప్పులూరి వెంకట సుబ్రహ్మణ్యం,
విజయవాడ

మయసభ : శ్రీ జాస్తి వెంకట సుబ్బయ్య చౌదరి
పెదపూడి, తెనాలి

శ్రీ సుబ్బిసెట్టి శ్రీహరి
"నవరస చింతామణి" శ్రీ డి. బసవేశ్వర
రావు, బందరు

నృత్య రూపకములు : శ్రీ శర్మ అండ్ పార్టీ

హరికథ : శ్రీమతి వి. ఉమాచౌదరి

ధన్యవాదములు : శ్రీ ఉయ్యూరు లక్ష్మయ్య
ఆహ్వాన సంఘ కార్యదర్శి

**11-1-1992** ఉదయం గం॥ 9-00 లకు

## శ్రీ వేమూరి ఆంజనేయశర్మ అభినందన సభ

సభాధ్యక్షులు : పద్మభూషణ, నటసామ్రాట్,
దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత
డా॥ అక్కినేని నాగేశ్వరరావు

ప్రారంభకులు : గౌ॥ కోణిజేటి రోశయ్య
ఆరోగ్యశాఖామాత్యులు

నివేదిక : శ్రీ మిక్కిలినేని సుబ్బారావు
సంపాదకులు అభినందన గ్రంథము

అభినందన గ్రంథఆవిష్కరణ :
డా॥ అక్కినేని నాగేశ్వరరావు

సన్మానము : డా॥ జంధ్యాల శంకర్ మేయర్

అభినందనలు : శ్రీ ఎ. రామస్వామి
ప్రధాన కార్యదర్శి ద.భా. హిందీ ప్రచార సభ-మద్రాసు
శ్రీ బోయపాటి నాగేశ్వరరావు
శ్రీ జి. లవణం కన్వీనర్ నాస్తిక కేంద్రం, విజయవాడ
శ్రీ ఈమని దయానంద్

సన్మానితుల సమాధానం :

వందన సమర్పణ : శ్రీ కడారు మల్లయ్య

ఉదయం గం॥ 11-30 లకు

## ఆంధ్రసభ కార్యవర్గ, నిధిపాలక సభ్యుల సన్మానసభ

అధ్యక్షులు : గౌ॥ కనుమూరి బాపిరాజు
వాణిజ్య పన్నుల శాఖామాత్యులు

'కలాకార్ కా వ్యక్తిత్వ ఔర్ కావ్యమేం ఉన్‌కీ అభివ్యక్తి'
—గ్రంథావిష్కరణ

సన్మానములు చేయువారు :
సర్దార్ శ్రీ బయ్యన వీరరాఘవరావు గుప్త
సెక్రటరీ శ్రీ కన్యాకా పరమేశ్వరీ అన్న సత్రం, విజయవాడ

ధన్యవాదాలు : డా॥ జె. నాగేశ్వరరావు
ఆహ్వాన సంఘ కార్యదర్శి

సాయంత్రం గం॥ 3-0౦ లకు

అధ్యక్షులు : గౌ॥ శ్రీ కనుమూరి బాపిరాజు
వాణిజ్య పన్నుల శాఖామాత్యులు

ప్రారంభకులు : గౌ॥ డా॥ పి వి. రంగారావు
విద్యాశాఖా మాత్యులు

నివేదిక : శ్రీబి అంజయ్య
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి

సందేశము :
పద్మభూషణ డా॥ మోటూరి సత్యనారాయణ
శ్రీ యం. యన్. రామచంద్రన్
దక్షిణ భారత హిందీ ప్రచార సభ
ఉపాధ్యక్షులు

ఉపన్యాసకులు : శ్రీ ఎ రామస్వామి
ప్ర కార్యదర్శి ద.భా. హిం.ప్ర.సభ
శ్రీ బి. చిన్నయ్యన్
అధ్యక్షులు, శిక్షా పరిషత్ ద.భా. హిం. ప్ర. సభ మద్రాసు
శ్రీమతి చెన్నుపాటి విద్య
మాజీ పార్లమెంటు సభ్యురాలు,
ప్రముఖ సంఘ సేవకురాలు
శ్రీమతి యం. వేదవల్లి
ఆంధ్రసభ
శ్రీ అడవి వెంకటేశ్వరరావు
హిందీ పండితులు

శ్రీ బోయపాటి నాగేశ్వరరావు

శ్రీ చవాకుల నరసింహమూర్తి

నిర్వహణ : శ్రీ సి. హెచ్. కుసుమహరనాథశర్మ

ధన్యవాదములు : శ్రీ కాజ వెంకటేశ్వరరావు
రాష్ట్ర ప్రచారక మండలి అధ్యక్షులు,
ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శి

గమనిక : మహాసభకు విచ్చేయు ప్రతినిధులకు, ద.భా. హిందీ ప్రచారసభ ఆంధ్ర కార్యవర్గ, నిధిపాలక సభ్యులకు భోజన, నివాస వసతులు శ్రీ కన్యకా పరమేశ్వరీ అన్నసత్రం, బ్రాహ్మణ వీధి, విజయవాడ-1 లో ఏర్పాటు చేయబడినవి. రైల్వేస్టేషన్ 1 కిలోమీటరు, క్రొత్త బస్సుస్టాండు ఒకటిన్నర కిలోమీటరు దూరములో వుండును. సిటీబస్సులో వచ్చువారు రథం సెంటరులో దిగవలయును. గుంటూరువైపు నుండి బస్సులో వచ్చువారు కార్పొరేషన్ ఆఫీసు వద్ద దిగవలయును. సత్రంలోనే ఆహ్వానసంఘ కార్యాలయంనుండి ప్రతినిధులు తమ భోజన టిక్కెట్లు, బాడ్జీలు, ప్రవేశ పత్రములు పొందవలయును.

## మారిన సంగఠకుల వివరం

| | | |
|---|---|---|
| 4 | జె. దొరస్వామిరెడ్డి<br>నల్లంగాడు (గ్రామం)<br>టి. కుప్పం-517 416<br>చిత్తూరు జిల్లా. | చిత్తూరు<br>కడప<br>అనంతపూర్ |
| 5. | కడారు మల్లయ్య<br>1-3-110, గీతాశ్రమ్ రోడ్<br>జనగామ-506 167<br>వరంగల్ జిల్లా. | వరంగల్<br>ఖమ్మం<br>కరీంనగర్<br>ఆదిలాబాద్, రంగారెడ్డి |
| 6. | చవాకుల నరసింహమూర్తి<br>31/2 ఆర్. టి. విజయనగర్ కాలనీ,<br>హైద్రాబాద్-500 457 | నిజామాబాద్<br>మహబూబ్‌నగర్<br>మెదక్, నల్గొండ<br>హైదరాబాద్, కర్నూలు, |

**కార్యవాహి కార్యదర్శి**

ఈ మొదలైన అంశాలనే 'రక్తాంబోధి' అనే శ్లోకం తెలుపుతుంది మరి ఇందులో అనవసర మైంది ఏదో?

నరేష్‌బాబు గారికి విషయం అర్థంకాక బాధ పడ్డారో, అర్థమైనా ఈ క్రొత్తవిషయం జీర్ణంకాక బాధపడ్డారో? తెలియదు. నా విమర్శ ఏ విధంగా వ్యర్థమైందని వారు ఆవేదన చెందారో సహేతు కంగా స్పష్టపరిస్తే సాహిత్య సత్యతకు దోహదం చేసినవారౌతారు. అలాకాక ఇవి రంగద్దాల కళ్ళకు కనపడిన పొడిభావాలైతే నేటి విమర్శ వె్రితలలు వేస్తుందన్న వారి మాటలు వారికే అన్వయమయ్యే ప్రమాదం ఉంది.

టి. బాల సుబ్బయ్య, సిద్దిపేట

2

స్రవంతి మాస పత్రికలోని సాహితీ వ్యాస వ్యాసాంగాలు అందరికీ అనువుగా చదువరులకు ప్రయోజనకరంగా ఉంటున్నవి. స్రవంతి అతి తక్కువ రేటుతో ముద్రిస్తున్న పాత్రికా యాజ మాన్యానికి నా శుభాభివందనాలు. ఈ స్రవంతిలో ఆధ్యాత్మికత కూడా చోటు చేసుకోవాలని నా కోరిక.

— జి.వి. గోపాల కృష్ణమూర్తి
పాతగుంటూరు-522001

3

స్రవంతి నవంబరు సంచికలోని వ్యాసాలు, అనువాద కథలు, గేయాలు చాలా బాగావున్నాయి. 'మందారమాల చదువుతుంటే 'భారతి'లోని 'కల గూరగంప' జ్ఞాపకం వస్తోంది. సహేతుక విమర్శ కొరవడుతున్న ఈ రోజుల్లో నిష్పాక్షిక మైన వ్యాసాలు అందిస్తున్న 'స్రవంతి'పై అభిమానం పెరుగుతోంది. ధర పెంచి అయినా సకాలంలో మార్కెట్టుకి విడుదలచేయగలరు.

కె. రఘువతి, సికింద్రాబాదు-10

మీరు ప్రేమతో ఇచ్చిన స్రవంతిని, వెంటనే ఆసాంతము చదివి వేసినాను. చాల బాగున్నదని చెప్పుట పునరుక్తియే. రచయితల చిరునామాలిచ్చుట మంచి పని. భారతి, ఆంధ్రపత్రిక కనుమరుగైన ఈ రోజులలో సాహితీ స్రవంతిగా, స్రవంతి పుంజు కొనుచుండుట చాలసంతోషకరము. మన స్రవంతిని, ఈ స్థితికి తెచ్చుటకై, మీరు పడుచున్న కష్టములను నేనంచనా వేయగలను. వెల తక్కువ పెట్టి కూడి, మీరు దీని నెట్లు నిర్వహించుచున్నారో, అను విష యము తెలియలేదు.

కె. నరసింహాచార్యులు
గోదా గ్రంథమాల, హైదరాబాదు.

'స్రవంతి' సాహితీ మాసపత్రికను ప్రతి మాసము చదువుతూ పత్రికలో వస్తున్న మార్పులను ఎప్పుడూ గమనిస్తూనే ఉన్నాము. ఈ పత్రిక వివిధ లేఖలతో కేవలం సాహితీఅభిమానులు, శ్రేయోభిలాషు లేకాక అందరూ చదవదగ్గది. ప్రభుత్వ సహాయం కూడా ఎంతయినా అవసరం. దక్షిణ భారత హిందీ ప్రచార సభ నిర్వాహక సంఘం ఎన్నో వొడిదుడుకులను ఖాతరుచేయక 38సంవత్సరాలుగా ఈ స్రవంతిని నడిపిస్తున్నదంటే ఎంతో ఆనంద దాయకం. ఇటువంటి తరుణంలో విద్యార్థిస్థాయి నుండి ఉపాధ్యాయ స్థాయివరకు ప్రతి ఒక్కరూ ఈ పత్రికకు సహకరించి చేయూత నందించాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. సంఘసేవకులు ముందుకు రావాలనీ, ప్రచారంచేసి స్రవంతిని అన్ని జిల్లాలకు విస్తరింపజేయాలనీ అందరికీ నేను మనవి చేస్తున్నాను. స్రవంతి పత్రికలోనే 'అక్షరస్రవంతి' అనే ఒకకాలమును పెట్టి నిరక్షరాస్యులను అక్ష రాస్యులుగా చేయాలని స్రవంతిని కోరుతున్నాను.

బ్రహ్మోజోశ్యుల చంద్రమౌళీశ్వరశర్మ
కరీంనగర్-505 001

# ఆంధ్రప్రదేశ్ హిందీ మహాసభలు

విజయవాడ



# ఆహ్వానము

**1992** జనవరి **10, 11** తేదీలలో

వేదిక : తుమ్మలపల్లి కళాక్షేత్రం

ఆర్యా !

దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర ఆధ్వర్యమున ఏర్పాటు చేయబడిన ఆంధ్ర ప్రదేశ్ హిందీ మహాసభల ఆహ్వాన సంఘము వారిచే 1992 జనవరి 10,11 తేదీలలో తుమ్మలపల్లి కళాక్షేత్రంలో జరుపబోవు హిందీ మహాసభలకు తామందరూ విచ్చేసి కార్యక్రమములను విజయవంత మొనరించ ప్రార్థన

ఇట్లు

ఆహ్వాన సంఘము

ఆంధ్రప్రదేశ్ హిందీ మహాసభలు

విజయవాడ

దక్షిణ భారత హిందీ ప్రచార సభ

ఆంధ్ర కార్యవర్గము

హిందీ కాలేజి

మాచవరం

విజయవాడ-520 004

ది 24-12-1991

ఫోన్ నెం. 68224

Edited Printed and Published by P Prasada Rao on behalf of the D. B Hindi-Prachar Sabha- Andhra, Khairatabad, Hyderabad-500 004